లోకంపోకడ — ఓమెన్














**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 4-5-'79

సిద్ధార్థినామ సం. వైశాఖ శు. అష్టమి,

సంపుటము 72 : సంచిక 34

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


# విషయానుక్రమణిక




ఉపయోగించుటకు మునుపు ★ ఉపయోగించిన తర్వాత ★ ఉపయోగించుటకు మునుపు

## అనారోగ్యులు అభాగ్యులు

మీకు విశాలమైన ఛాతీ, దృఢమైన శరీరం మంచి తూనిక గలదా? లేకుంటే వెంటనే 'జీవన్‌టోన్' ఉపయోగించుట మంచిది మీరు ఒక పౌండు జీవన్‌టోన్ కొన్నారంటే మీ శరీరం దృఢమై, తూనిక అధిక మగుటకు మేము గ్యారంటీ ఇవ్వగలము.

## ఆరోగ్యమే భాగ్యము

నిజమే ఆరోగ్యమే భాగ్యము. ఆరోగ్యం బాగా వున్నట్టయితే డబ్బును సంపాదించడం అసాధ్యమేమీ కాదు! లేకుంటే... జీవన్‌టోన్ సాధారణమైన వ్యక్తులకు వచ్చే వ్యాధులను ఇట్టే బాగుచేయగలదు. మీరు మీ వయసుకన్న అధిక వయసుగలవారిలా గోచరిస్తున్నారా? అలాగైతే వెంటనే ఉపయోగించడం ప్రారంభించండి 'జీవన్‌టోన్'. మీకు తగినంత ఆరోగ్యం, దృఢకాయం, తూనిక సమకూరిన వెంటనే జీవన్‌టోన్ ఉపయోగించుట ఆపుచేయాలి కాగా దేహానికి బలం సమకూర్చడానికి, తూనిక అధికరించడానికి జీవన్‌టోన్‌లో కొన్ని విశేషమైన మూలికలను చేర్చబడి యున్నవి. కాని ఇందులో జంతువుల క్రొవ్వు చేర్చబడి యుండలేదు. ఒకవేళ ఇంతకుమునుపు అలవాటు వున్నట్లయితే

స్పెషల్ జీవన్‌టోన్ పెద్ద సీసాలు అన్నిచోట్ల సులభంగా లభించగలవు. (వ్యాయామం అవసరంలేదు.)
కొనసాగించ(వచ్చు) వెల **454** (గ్రాములు (1 పౌండు రు. **18/-**)
సెల్ హార్మోన్ మరియు స్పెర్మో పౌడర్ వయసుకు వచ్చినవారికి మాత్రమే వెల : రు. **24-00** (ఉభయులకు)
స్కిన్ ప్యూర్ మొటిమలను తొలగించి మీ ముఖమును సుందరముగా తేజోవంతముగా యుంచును. వెల : రు. **20-00**

క్రింది చోట్లయందు లభించగలవు :

వరంగల్ ఆయుర్వేద రసాయనశాల, జె సి ఎన్ రోడ్డు ఆయుర్వేద మెడిసిన్ ఆయుర్వేదభవన్ (గిడియన్స్), ఎమ్ వి రోడ్డు. మచిలీపట్నం · ఉమామహేశ్వర ఆయుర్వేదిక్ ఏజన్సీస్, తెనాలి గుడివాడ హనుమంతరావు & సన్స్ హైదరాబాద్ సంపత్ & కం., పంజగుట్ట, సాయిరాం మెడికల్స్, కోటి, బ్యాంక్ రోడ్డు, వసంత మెడికల్ స్టోర్స్, 4-4-293, బ్యాంక్‌రోడ్డు, మహేశ్ మెడికల్‌హాల్, క్లాక్ టవర్ ఎదుట, పద్మ మెడికల్ హాల్, గుల్జార్‌హౌస్ ఇచ్ఛాపురం. శాంతా మెడికల్‌స్టోర్స్. ఎర్నాకిమిడి పి. ధర్మనారాయణమూర్తి & సన్స్. కాశిబుగ్గ : తంగుడు నారాయణమూర్తి. టెక్కలి. టి. ఎస్ ఎస్ మూర్తి. పార్వతీపురం. ఎస్మెన్ మెడికల్ స్టోర్స్ పాలకొండ, సూర్య డ్రగ్ హౌస్. శ్రీకాకుళం. పట్నాల సత్యనారాయణ అండ్ సన్స్, పాలకొండ స్ట్రీట్. విజయనగరం పట్నాల లింగప్రసాదరావ్ మెయిన్‌రోడ్డు విశాఖపట్నం వీఎమ్ & కం, ఎ వి ఎన్. కాలేజి రోడ్డు, డా. జె ఎ శాస్త్రి, సూర్యాబాగ్ జంక్షన్. రాజమండ్రి ఈశ్వరదాస్ & కం, జైహింద్ బిల్డింగ్ గుంటూరు ఆంజనేయ మెడికల్స్, జిన్నా టవర్ సమీపం. శ్రీ సత్యనారాయణ ఏజెన్సీస్. కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ విజయవాడ · శ్రీ ధనలక్ష్మీ మెడికల్‌స్టోర్స్, సూర్యా మెడికల్ స్టోర్స్, పార్కురోడ్డు అనకాపల్లి : కాసుమంచి అప్పలరాజు. ఏలూరు : వాయుగ్రీమ్ షాప్, 10-75 స్ట్రీట్ నెల్లూరు కె ఎస్. రావ్ & సన్స్, ట్రంక్‌రోడ్డు. సూర్యాపేట - కమర్షియల్ సూర్య నివాస్ - 2 టవున్ పోలీస్‌స్టేషన్ ఎదుట సికిందరాబాద్ జ్యోతిమెడికల్ హాల్ 28. ఎమ్. జి రోడ్డు, డి. జె. ఏకిబ్ & కంపెనీ, సుభాష్‌రోడ్డు. జమ్మలమడుగు, శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. కావలి · డా మల్లేశ్వరరావ్, ఆర్.ఎమ్.పి. మెస్సర్స్ సుగుణ ఆయుర్వేద ఆలయం రాపల్లె · రామకృష్ణ మెడికల్ అండ్ జనరల్ ఏజెన్సీస్, రైల్‌పేట. తాడేపల్లిగూడెం. కల్యాణరామ ఆయుర్వేద వైద్యశాల, మామిడివారి స్ట్రీట్, హేవర్ బ్రిడ్జి సమీపం. కందుకూరు ముల్లశెట్టి వెంకటేశ్వర్లు మెడికల్ స్టోర్స్ తిరుపతి తారిగొండ మెడికల్స్, 247-బి, సరోజినిరోడ్డు. అనంతపురం : డి సోమనాథశాస్త్రి, మునిసిపల్‌ఆఫీస్ రామచంద్రపురం : రూపా మెడికల్‌స్టోర్స్, మునిసిపల్ మార్కెట్టు, సుభాష్ రోడ్డు. అనంతపురం : కో-ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీ లిమిటెడ్, రైల్వేస్టేషన్ సమీపం. పులివెందుల · శ్యామల మెడికల్ స్టోర్స్, మెయిన్‌బజార్. హిందూపురం · కె ఆర్ భాస్కరయ్య & సన్స్, మెయిన్ బజార్. - బాలాజి మెడికల్ సెంటర్, మెయిన్‌బజార్. ఆదోని : కమలాపుర్ గోవిందశెట్టి, ఆర్. ఎమ్. సి కమలాపుర్ నాగయ్యశెట్టి & సన్స్. కొత్తగూడెం ఎర్రంరెడ్డి శంకరయ్య & సన్స్ ధర్మవరం శ్రీ అంజనేశ్వర మెడికల్‌స్టోర్స్, మెయిన్‌బజార్. గుంతకల్లు · గోపాల్ మెడికల్‌స్టోర్స్. జంగారెడ్డిగూడెం జీడి వెంకటరావ్. రాయదుర్గం శ్రీ లక్ష్మీవెంకటేశ్ మెడికల్‌స్టోర్స్. తాడిపత్రి : కృష్ణ మెడికల్స్, మెయిన్‌రోడ్డు. గోరంట్ల : వెంకటేశ్వర మెడికల్ స్టోర్స్,- హిందుపురం పోస్ట్. కర్నూలు. శ్రీ రామకృష్ణ మెడికల్‌హాల్, 52/19 బాస్టియన్‌రోడ్డు. గుత్తి · డి ఆర్. రాజాశెట్టి & సన్స్, మెయిన్ బజార్ పామిడి : ఎస్. సి. చిన్నప్పశెట్టి. కడప-1 : శ్రీ సాయిరామ్ ఆయుర్వేదిక్ మెడికల్స్, 13/348 మవిరావ్ స్ట్రీట్. గిద్దలూరు : ఎమ్. సాంబయ్యశాస్త్రి అండ్ సన్స్. ఆస్రి మెడికల్‌స్టోర్స్ అండ్ బుక్ సెల్లర్స్.

అత్యధిక విక్రయందార్లు : మెసర్స్. బాలాజి కెమికల్ వర్క్స్, ఎ. పి. ఐ ఇ. 5 వ రోడ్డు, బాలనగర్, హైదరాబాద్-37. ఫోన్ : 269490

పై పేర్కొనబడిన తయారీలు మీ వూరియందు లభించనట్లయితే దయచేసి రు. 5-00 మాకు పంపిన మీకు వి. పి. పి. ద్వారా పంపగలము.

**మెసర్స్ : జీవన్‌టోన్ ప్రోడక్ట్స్, 17/1, కేంబ్రిడ్జి రోడ్డు, అలసూరు, బెంగుళూరు-560 008**






## మహర్షుల ప్రభావం

మహా మునులకు కోపం వస్తే ఎంతవాళ్ళయినా తమ శాపంవల్ల అణచి వేస్తారు. అభిమానం కలిగితే ఎంత మీదికైనా ఎత్తివేస్తారు. మునుల ప్రభావం కేవలం ప్రత్యేక వ్యక్తులమీదనే కాదు; ప్రకృతిమీద కూడా పనిచేస్తుంది. ఈ విషయంలో ఒక మునిని మించినవారు మరొకరుకూడా ఉండవచ్చును.

అతి ప్రాచీనకాలంలో ఋతవాక్కు అనే మహాముని ఉండేవాడు. పేరుకు తగినట్లే, అతడు ఏమిచెప్తే ఆ రీతిగానే జరిగేది. ఆయన భార్య ఉత్తమ యిల్లాలు. వారికి లేకలేక ఒక కుమారుడు కలిగాడు. ఆ బాలుడు ఏ ముహూర్తాన పుట్టాడోగాని, తండ్రికి వెంటనే జబ్బు చేసింది. తల్లికి కుష్ఠురోగం వచ్చింది. ఇలా వుండగా పిల్లవాడు పెరిగినకొద్దీ వాడిలో చెడ్డగుణాలె పెరిగాయి. ఇతర మునిపుత్రుల భార్యలను అపహరించడంవరకూ వచ్చింది. ఉత్తముడైన తండ్రి మనస్తాపానికి మేరలేకపోయింది. ఆ ముని జ్యోతిర్వేత్తయైన గర్గ మహామునివద్దకు వెళ్ళి 'ఈ పరిస్థితులకు కారణం యేమిటి?' అని ప్రశ్నించాడు. 'నీ కుమారుడు రేవతి నక్షత్రం అంత్యభాగంలో పుట్టినందువల్ల – ఆ నక్షత్ర దోషంవల్ల ఇలా జరిగింది' అని చెప్పాడు. ఋతువాక్కు ఆ నక్షత్రంపై కోపించి నేలపై పడిపోవాలని శపించాడు. వెంటనే రేవతి భూమిపై ఉన్న కుముద్వాద్రిమీదపడిపోయింది. అప్పటినుంచీ ఆ పర్వతం రైవతక పర్వతమయింది. ఆ నక్షత్రం పడిన చోట ఒక సరస్సు ఏర్పడి అందులోంచి ఎంతో అందంగల ఒకకన్య ఉద్భవించింది. ఆ దగ్గరఉన్న ప్రముచముని-రేవతీకాంతి సంభూత అయిన ఆ కన్యకు రేవతి అని పేరుపెట్టి పెంచుకున్నాడు. ఆమెకు యుక్త వయస్సురాగా, వివాహానికి తగినవరుడెవ్వడా? అనే ఆలోచన ఆయనకు కలిగింది, అగ్నిశాలకు పోయి అగ్నిదేవుణ్ణి అడిగాడు. దుర్దముడనె రాజు తగినవాడని సమాధానం వచ్చింది.

ఇంతలో వేటకువచ్చిన ఆ దుర్దముడే ఆమునికి నమస్కరించి పోవలెనని అక్కడికి వచ్చి 'మహాముని ఆశ్రమంలో ఉన్నారా?' అని అక్కడున్న రేవతినే ప్రశ్నించాడు. ఆ మాట విని ఆ ముని హోమగృహంనుండి వచ్చి రాజునకు ఆతిథ్యమిచ్చి, రేవతిని వివాహమాడవలెనని అతనిని కోరి, సమ్మతింపజేశాడు. రేవతికీ సమ్మతమయింది.

రేవతి తన వివాహాన్ని రేవతీ నక్షత్రంలో చెయ్యవలెనని అన్నది. "ఇప్పుడు ఆనక్షత్రం ఆకాశంపై లేదని వృత్తాంతమంతా తండ్రి రేవతికి చెప్పాడు. ఆమె 'ఋతువాక్కేనా గొప్పముని? మీరు కారా? ఆయన, ఆ నక్షత్రాన్ని కిందికి దించివేస్తే మీ తపశ్శక్తివల్ల మళ్ళీ దానిని నక్షత్రమండలానికి ఎక్కించలేరా?' అన్నది.

తర్వాత కుమార్తె కోరిక ప్రకారం తండ్రి ఆ నక్షత్రాన్ని తిరిగి నక్షత్రమార్గంలోనిలిపాడు. తర్వాత రేవతీదుర్దములకు వివాహం జరిగింది.

మునుల్లో ఒకర్ని మించినవారు మరొకరనీ, వారి ప్రభావం అసాధారణమైనదనీ తెలుస్తున్నది.

## ఉత్తరాలు

### ముఖచిత్రం

13.4.79 రాజ్యలక్ష్మి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది.

షేక్ అబ్దుల్‌మన్నాన్, (ఖమ్మం)

* * *

రాజ్యలక్ష్మి ముఖచిత్రముతో వెలువడిన సంచిక చూడటానికి చాలా ముచ్చటగా ఉంది.

శ్రీమన్నారాయణబాబు, ఇతరులు (ఆత్మకూరు)

* * *

"హరిజన్"లో నటి రాజ్యలక్ష్మి గారి ముఖచిత్రం చాలా బాగున్నది. మా హృదయాలనెంతో ఆకర్షించింది. ఆనాటి సంచికను చూసిన వెంటనే మీకు మా ఆనందాన్ని తెలియచేయాలనిపించింది.

భూలక్ష్మి సుబ్బారావు, (మదరాసు)

* * *

20.4.79 పత్రిక ముఖచిత్రం చాలా ఆకర్షణీయముగా ఉంది. కోటిగాడు సీరియల్ చక్కని అనుభూతిని కలిగించింది. ఉదయాస్తమయాల మధ్య కథ బాగుంది.

క్రోతు పాపారావు, (పొందుకూరు)

* * *

20.4.79నాటి మీ (మా) ఆంధ్ర సచిత్ర వార పత్రిక మొదటి పేజీపై ప్రచురించిన శ్రీదేవి ముఖ చిత్రం ఆకర్షణీయముగావుంది. ప్రచురించిన మీకు నమస్కృతులు.

సిహెచ్. సుదర్శన్‌రావు, (డోర్నకల్)

* * *

20.4.79వ తేదీన వెలువడిన పత్రికపై ముఖ చిత్రం "శ్రీదేవి" దేదీప్యమానంగా ఉంది. ముఖ చిత్రాలు అందంగా ముద్రించడంలో మీకు మీరే సాటి. "అది డ్రమ్ము—— నేను ఇక్కడున్నాను" అనె కార్టూన్‌లో శోభనం గదిలో డ్రమ్మును సృష్టించడం మహామహా అన్యాయం. కాని, కార్టూన్ నవ్వించదగినదే.

పెన్మెత్స సూరిబాబు, (హైదరాబాద్)

### సీరియల్

ది. 20.4.79 ఆం. స. వా. పత్రికలో పడిన కోటిగాడు సీరియల్ గురించి—

అందులో టెండర్లు పిలవడం, తెరవడం మొదలయిన వాటి గురించి ప్రస్తావన జరిగింది.

సీలువేసిన టెండర్లు, టెండరుదారులే సీలు వేసిన కవర్లో ఇవ్వాలిగాని, టెండర్లని ఆఫీసర్లు సీలువేసిన కవరులో పెట్టడం అంటూ ఉండదు! ఎర్నెస్టు మనీ అంటే ధరావతు సొమ్ము!!

అందువలన టెండరుఫారాల ధరావతు అంటే అర్థంలేని మాటల కూర్పు అవుతుంది.

పాలడుగు వెంకటేశ్వరరావు, (తిరుపూరు.)

# వారఫలం

4-5-1979 శుక్రవారం మొదలు
10-5-1979 గురువారం వరకు

**మేషం:—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రులసహాయం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు.

**వృషభం:** ఆర్థికవ్యవహారాల్లో మొగమాటాలు తగవు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థివ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాలలో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు — పుణ్య కార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మిథునం:—** సంతోషకరమైన వార్తలను వింటారు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ మంచితనం మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:—** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో పోటీదారితో పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**సింహం:—** ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**కన్య:—** చేతికి వచ్చిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది. చికాకులకు గురి కావలసి వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**వృశ్చికం:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ప్రయోజనసంగల సంభాషణలను జరుపగలరు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు — దైవ కార్యాలు నెరవేరతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**ధనుస్సు:—** రావలసిన డబ్బు అందుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**మకరం:—** వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మటం తగదు. ఆందోళన కలుగుతుంది. చికాకులకుగురి కావలసివస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలించగలవు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:—** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. అనవసరమైన వ్యయం జరుగుతుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. విలాస వస్తువులు కొంటారు.

**మీనం:—** రావలసిన డబ్బు అందకపోవడం వలన ఇబ్బంది కలుగుతుంది. పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆడవారి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

—మహేష్

# మహేష్ స్మృతి

ప్రముఖ రచయిత, జ్యోతిశ్శాస్త్రవేత్త, సినీ నిర్మాత శ్రీ మహేష్ గుండెపోటు వల్ల ఆకస్మికంగా శనివారం ఏప్రిల్ 14 ఉదయం మద్రాసులో చనిపోయారని తెలుపుటకు విచారిస్తున్నాం.

పూర్తి పేరు బెండగిరి ఉమామహేశ్వరం. స్వస్థలం జగ్గంపేట. చిన్నప్పుడే అనకాపల్లికి తరలి వెళ్ళిపోయి అక్కడ కీ. శే. మాతృక మల్లిఖార్జునుడు దగ్గిర పనిలో చేరారు. ఆయన మహేష్‌కి సంస్కృతం చెప్పించారు. సంస్కృతం పరీక్షల్లో పాస్ అయి మహేష్ మెట్రిక్, ఇంటర్, బి. ఏ., వగైరాలు కూడా పూర్తి చేసుకున్నారు. మద్రాసులో బ్రహ్మయ్య అండ్ కంపెనీలో ఆడిటరు అప్రెంటీస్‌గా చేరి ఆంధ్రపత్రికకి రాయటం ప్రారంభించారు. క్రమంగా ధ్యాస సినిమా నిర్మాణం విగాదికి పోయింది.

అనగనగా ఒక తండ్రి, ముగ్గురు మూర్ఖులు, గంగా యమునా సరస్వతి — చిత్రాలు తీశారు. ప్రస్తుతం ఒక సినిమా నిర్మాణం మొదలు పెట్టారు.

మహేష్ వయస్సు సరిగ్గా తెలీదు. సుమారు ఏభయి అయిదు ఉంటుందని



అంచనా. ఆయనకి తండ్రిలేరు కాని తల్లి ఉన్నారు. ఇతర కుటుంబ సభ్యులు కూడా ఉన్నారు. జ్యోతిషమే కాక, చమత్కారం అధికంగా ఉండే కథలు రాయటం ఆయన ప్రత్యేకత.

బెండగిరి ఉమామహేశ్వరం 13శుక్రవారం రాత్రి నిద్రకి ఉపక్రమించారు. మరునాడు ఉదయం చనిపోయి ఉన్నారు వారు ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు 'వారఫలం' తోనేగాక 'ముగ్గురు మూర్ఖులు' కథల; అనగనగా ఒక తండ్రి సీరియల్ మున్నగు యితర రచనల ద్వారా కూడా సుపరిచితులు.


ఇది ఒక పాంథశాల!
శ్యామల
gopaal
సీరియల్ ప్రారంభం
మానవుని అనంతయాత్రలో ఈ ప్రపంచాన్ని ఒక పాంథశాలగా పేర్కొన్నాడు భర్తృహరి

"నాకు ఉగాదులు లేవు, నాకు
ఉషస్సులు లేవు
నేనొక హేమంత కృష్ణానంత
శర్వరిని"

తనను గురించే వ్రాసినట్లున్నాయి ఆ పదాలు — అనుకుంటూ చేతిలోని పుస్తకం మూసింది సంధ్య. తనపేరే సంధ్య! చీకట్లు క్రమ్ముకు వచ్చే సమయం! ఇక తన జీవితంలో ఉషస్సు ఎలా ఉంటుంది! వెలుగు ఎక్కడుంటుంది?

'నిజంగా ఇప్పుడూ నీ జీవితంలో వెలుగే లేదా?' అని ప్రశ్నించింది అంతరాత్మ. 'ఆ మాట అనలేను ... కాని వెలుగు వెంట వచ్చేనీడలే ఎక్కువగా క్రమ్మాయి నాపైన' జవాబిచ్చింది మనసు.

నది ఒడ్డున కూర్చొని ఉంది సంధ్య, నీటిపైన పోతూ ఉన్న పడవను చూస్తూ. ఇంకా సూర్యాస్తమయం కాలేదు. భాను కిరణాలు గులాబి, బంగారు వర్ణాలతో నదీ జలంపైన ఏవో డిజైన్లు దిద్దుతున్నాయి.

పడవలోనుంచి రాధ, సుధ చేతులూపుతున్నారు. వాళ్లను పట్టుకొని కూర్చొని ఉన్నాడు మను. తిరిగి చేతులూపి ఆలోచనలో పడింది సంధ్య

రాధకి ఆరు ఏళ్ళు, సుధకి నాలుగేళ్ళు. వాళ దృష్టిలో సృష్టి అంతా అందమైనదే. మనుష్యులంతా మంచివాళ్ళే. కుక్కలు, పిల్లులు, పిట్టలు అన్నీ మంచివే. రాక్షసులు, మాంత్రికులు కథల్లోనే.

నవ్వుల పువ్వులు కూర్చుకుంటూ, వెన్నెల దండలు కట్టే బంగారు బొమ్మలు, కోరుకున్న వస్తువు లభించనప్పుడు ఏడిస్తే— ల కన్నీరూ ముత్యాలే!

"నక్షత్రాలే పుష్పాలయితే
మెరుపు తీగలే దారాలయితే
మక్కువ పువ్వుల చక్కని దండలు
మొక్కుతూ దేవుని మెడలో వేస్తాం—"

రాధ పాడే పాట గుర్తొచ్చింది. 'ఐస్ క్రీమ్ నది ఎక్కడైనా ఉంటుందా?'—సుధ ప్రశ్న.

'ఉంటే దానిపైన ఓ స్కేటు వంతెన కట్టాలా?'

'ఆ వంతెన దాటాక వస్తే చాక్లెట్ మేడలో ఉండామా?'

"అప్పుడు నా పేరు 'సిండెల్లా' అని మార్చుకుంటా"

"నేనేమో 'స్లీపింగ్ బ్యూటీ' అని పెట్టుకుంటా."

కిలకిలా నవ్వులు. 'మమ్మీదగ్గర మంత్ర దండం ఉంటుందిట— కోరుకున్నది మనకి ఇస్తుందిట—!'

'అంటే ఏమో ఒక "ఫెయిరీ"టరెక్కలు కూడా వుంటాయా?'

పగటి కలలు!

అటువంటి కలలు కనలేని వయస్సు తనది. ఇటువంటి కలలూ కనలేని అనుభవాలు తనవి. ఇప్పుడూ ఆలోచనలే. విందుకూ పనికిరాని- ఆ నొప్పి కరిగించే- ఆలోచనలు!

విసుక్కుంటూ లేచి నిల్చుంది. చీరకు అంటిన ఇసుక దులుపుకుంది.

'పిల్లలను మను తీసుకువస్తాడులే, ఇంటికి వెళ్ళిపోతే' అనుకుంది. ఇక్కడే కూర్చొని ఆలోచిస్తూ ఉండే శక్తి లేదు తనకి. మరో సారి దూరంగా ఉన్న పడవను చూసింది. పయనించే పడవ ... జీవితమూ అంతేగా? అన్నా, మళ్ళీ ఆలోచనలు! గబ గబా ఇంటివైపు నడక సాగించింది.

బలవంతంగా ఆలోచనలు దర్శించుకుంటూ ఇంట్లో అడుగు పెట్టగానే నిర్మలక్క ఎదురొచ్చింది.

"గుడ్‌న్యూస్ సంధ్యా!"

"చెప్పనా?" ఆత్రంగా అడిగింది

"అంత తేలికగా చెప్పను సిమ్మీ! చెప్పమంటే ఏమిస్తావోయ్?" రవి అన్నాడు

చిన్నగా నవ్వింది సంధ్య. 'మీకు ఏమిచ్చినా మీ ఋణం తీరదు!''

నిజమే. తన జీవితంలో కొన్ని అపురూపమైన వరాలూ ఉన్నాయి.

రాధ తన జీవితానికో అర్థాన్ని, గమ్యాన్ని ఇస్తున్నది.

ప్రాణప్రదంగా ప్రేమిస్తున్న అక్కా బావగారు స్థిరపడటానికి చేయూత నిస్తున్నారు

ఇంతకీ శుభవార్త ఏమిటి?

"చెప్పవే, అక్కా, చెప్పు!"

తలూపుతు నిర్మల చేతిలోని కవరు లక్కొని సోఫాలో కూలబడింది.

"సేమ్ డాంగ!" నవ్వేశారు నిర్మల, రవి.

కెనడా నుంచి కేప్టెన్ అరోరా వ్రాసిన లేఖ అది. అతను భారతరాయబారకార్యాలయంలో పని చేస్తున్నాడు. 'అట్వానా' లోని ఒక పెద్ద హాస్పిటల్‌లో "న్యూట్రిషన్" శాఖలో సంధ్యకు జాబ్ ఇవ్వబడింది జాయినవటానికి ఒక నెల టైమిచ్చారు. మూడు సంవత్సరాలు కాంట్రాక్టు రాయాలి. జీతం వగైరా వివరాలన్నీ ఇచ్చాడు. ఇది చాలా మంచి అవకాశమని, రాధను తీసుకొని వెంటనే బయల్దేరి రమ్మని సంతోషంగా ముగించాడు

సంధ్య హోమ్ సైన్సు బి. యస్సీ చదివింది. తమ్ముడు చెప్పాడో దర స్నాపికేషను నివేదికలున్నూ తెలిసినవాళ్ళందరికి ఉత్తరాలు రాసింది ఉద్యోగం కోసం. అప్పుడు అరవ్ అరోరా ఢిల్లీలో ఉన్నాడు. తన ఉత్తరం అందినదనీ, వీలయిన సాయం తప్పక చేస్తాననీ జవాబు వ్రాశాడు. ఎన్నాళ్ళ

తనను 'ఒట్టావా'లోని ఇండియన్ ఎంబసీలో పోస్ట్ చేశారని వెళ్ళేముందు మరొక లెటరు రాశాడు. తను అతని విషయమే మరిచిపోయింది. పాపం, శ్రద్ధగా గుర్తుపెట్టుకొని, ప్రయత్నించాడన్నమాట!

మనసును మళ్ళించాలని ఉద్యోగం చేయదలుచుకుందేగాని, ఫారిన్ వెళ్ళాలనే మాట ఎన్నడూ అనుకోలేదు సంధ్య. అనుకోకుండా వచ్చిన అవకాశం ఇది. జ్ఞాపకాలు వెంటాడుతుంటే తప్పించుకోవటానికి ఇంతకు మించిన అవకాశం ఉంటుందా? క్రొత్త దేశంలో క్రొత్త జీవితం మొదలుపెడుతుంది తను ఇక.

వెళ్ళటానికి అక్షణాన్నే నిశ్చయించుకుంది సంధ్య కాని-కాని-ఇక్కడ అక్కా, బావ ఉన్నారు. తెలిసిన వాళ్ళున్నారు. తెలిసిన ఊరు యిది. కాని ఏవో భయాలు... సందేహాలు ...

అయినా వెళ్ళాలి— గుండెని పిండేస్తున్న ఈ స్మృతుల నించి పారిపోవాలి.

వద్దన్నా చుట్టుముడుతున్న జ్ఞాపకాలు.

"సంధ్యా! నీ నిశ్చయం తెలపటానికి ఇంకా టైముంది. అప్పుడే అలా దిగులు పడకు" మృదువుగా అంది నిర్మల.

దిగులనేది తనకుంది ఇప్పుడైనా దూరమయిందా? దిగులు దిగులుగా, గుబులు గుబులుగా ఉండటం ఓ అలవాటయి పోయింది తన మనస్సుకి.

పైకి మాత్రం చిన్నగా నవ్వి "పిల్లలు ఇంకా రాలేదే?" అంది.

అంతలోనే పిల్లలొచ్చాయి అల్లంత దూరాన సందడిగా మాటలు, నవ్వులు, గంతులు.

ఒక్కసారిగా వచ్చి మీదపడింది రాధ.

"మమ్మీ! నువ్వు వస్తే కింత నాసం దేశా?"

ఇది స్పైన నడవలో కాసేపు వెళ్ళి రావటమనేది ఓ గొప్ప సాహస కృత్యంలా ఉన్నట్టుంది వాళ్ళకు. ఇద్దరూ ఒకేసారి గబగబా వర్ణించేస్తున్నారు. కొన్ని మాటలు మింగేస్తున్నారు కాస్త ఆయాసపడుతున్నారు. కానీ ఎంత ఉత్సాహంగా ఉన్నారనీ!

భగవాన్! ఈ ఉత్సాహం ఈ చిట్టి తల్లులకు చిర్కాలం ఉండనీ రాధ తను ఏరుకొచ్చిన రంగు రంగుల రాళ్ళు చూపిస్తున్నది.

తటాలున రవి అన్నాడు, "సంధ్యా, నీవు ఫారిన్ వెళ్ళేట్లయితే రాధను ఇక్కడ ఉంచకూడదూ? నీకు అక్కడ నచ్చి, సెటిల్ అవదల్చుకుంటే, అప్పుడు పంపిస్తాను .. రాధ వెళ్ళిపోతే ఇంట్లో కళే ఉండదు సుమా!"

వాళ్ళ ఇంటి కళ మాట అటుంచి, బావ చెప్పినట్టు చేయటమే మంచిదేమో? వెళ్ళి కొంత అలవాటు పడేవాక, సరయిన ఇల్లు తీసుకోవటం, స్కూల్లో సీటు వగైరా విషయాలన్నీ తేల్చుకున్నాక రాధను రప్పించుకోవటమే మంచిది.

కాని రాధ లేకుండా ఒక్కరోజైనా ఉండగలదా? మనసొప్పుతుందా? అన్నీ ఆలోచించుకోవాలి. చిన్నో విషయాలు తేల్చుకోవాలి. ఆ పైన ఫారిన్ వెళ్ళేది, లేనిది నిర్ణయం తీసుకోవాలి.

ఆ రాత్రి పడుకున్నాక నిద్రపట్టలేదు సంధ్యకి. భవిష్యత్ నిర్ణయం గూర్చి ఆలోచిద్దామని ప్రయత్నిస్తే మనసు మాత్రం

# ఇది ఒక పాంథశాల

కళ్ళెం వదిలిన గుర్రంలా గతం వైపే పరిగెత్తసాగింది

ఆ రోజు సంధ్య కాలేజి నుంచి వచ్చేసరికి ఇంట్లో హోరాహోరీ వాద ప్రతివాదాలు జరిగిపోతున్నాయి. ఓ చిన్న సైజు రణరంగాన్ని గుర్తు తెస్తున్న ఆ సీనరీలో మెంబర్లు అక్క, అమ్మ, నాన్న, మామయ్య.

"వద్దంటే వినిపించుకోరేం? నా మంచి నా కంటే మీ కెక్కువ తెలుసా?" కోపంగా అంది అక్క.

"మేం నీ కంటే పెద్దవాళ్ళం, మర్చిపోకు" మరింత కోపంగా అంది అమ్మ.

"చూడమ్మా, నిర్మలా" అనునయంగా చెప్పబోయాడు మామయ్య "ఏదో ఒక నాటికి నీవు పెళ్ళి చేసుకోవలసిన దానివే. సంబంధం చూసి నిన్నో యింటిదాన్ని చేయవలసిన బాధ్యత మీ అమ్మ, నాన్న మీద ఉంది. బరువు దించుకోవాలని వాళ్ళు ప్రయత్నించటం తప్పా. అమ్మా?"

"మామయ్యా, ప్లీజ్— ఇలా మాట్లాడకు. నీవు చెప్పినవన్నీ నేను కొట్టిపారేస్తున్నాను. ఏదో ఒకనాటికి పెళ్ళి చేసుకోవలసినదాన్నే నన్నావు— ఎందుకు చేసుకోవాలో కాస్త చెప్తావా? ఇప్పుడు చేసుకోవాలని నాకేంలేదు. అనిపించిననాడు చేసుకుంటాను. కాని, ఎప్పుడో అవసరం ఫీలవుతానని ఇప్పుడే మాత్రం చేసుకోను!

నన్నో యింటిదాన్ని చేయవలసిన బాధ్యత అమ్మది, నాన్నది అన్నావు- అదేం కాదు! ఎప్పటికయినా పెళ్ళంటూ చేసుకుంటే నా పెళ్ళి నేనే చేసుకుంటాను. అందులో మీ ఎవ్వరి ప్రమేయం ఉండదు, సరేనా? నేనో బరువుగా ఉన్నానా మీకు? పెళ్ళి చేస్తే మరింత బరువవుతాను తెలుసా?"

"అవునక్కా, పెళ్ళయినాక ఆడవాళ్ళు చాలా మంది ఒళ్ళుచేసి, బరువవుతారు!" అమాయకంగా ముఖం పెట్టి అంది సంధ్య.

అంతా ఫకాలున నవ్వేశారు. వాతావరణంలోని సీరియస్‌నెస్ మాయమైంది.

అందరూ కాస్త స్వరాలు తగ్గించి, కొంచెం సరసంగా మాట్లాడసాగారు.

"నీకు చెప్పలేనే అమ్మాయ్! నీవు లాయరు వయితే బాగుంటుంది" అన్నాడు మామయ్య.

"లాయర్ని కాను మామయ్యా, జర్నలిస్ట్‌ని అవుతా — నీ మీద వ్యాసాలు, కథలు రాసేస్తా—" బెదిరిస్తున్నట్టు అంది నిర్మల.

నిర్మల బి. యే ఫస్ట్ క్లాస్‌లో పాసయినాక, జర్నలిజం కోర్సులో చేరింది. ఎప్పుడూ తను ఫస్టే. ఈ కోర్సులోను ఫస్ట్ ర్యాంక్ కొట్టేసి, పెద్ద జాబ్ నిమిషాల మీద సంపాదించుకుంటుందని సంధ్య నమ్మకం.

సంధ్య చదువులో అక్క అంత బ్రిలియంట్ కాదు. నిర్మలకున్నట్టు ఆశయాలు లేవు. నిర్మలకు ఉన్నట్టు స్నేహితులు లేరు, సరదాలు లేవు. ఏదో మామూలుగా కాలేజికి వెళ్ళి వచ్చేస్తూ ఉండటం తప్ప ఏదో ఊడబొడిచేద్దామనే ఆలోచనలు లేవు.

నిర్మల అలా కాదు. జీవితంలో ఏదేదో చేయాలని, ఏవేవో సాధించాలని తపన ఉన్నది. అందమూ, తెలివి ఆమెకు దేవుడిచ్చిన వరాలు. కాలేజిలోకాని, ఇంట్లోకాని ఆమె చుట్టూ ఎప్పుడూ స్నేహితులు ఉంటారు. బంగారు కలలతో సామ్రాజ్యాలనే ఏలేస్తాననే విద్యార్థిని నిర్మల.

సంసార పక్షమైన తత్వం కల సంధ్య ఇంటరు అవగానే హోమ్ సైన్సు కాలేజీలో చేరటానికి కుతూహలం చూపింది. ఎప్పుడో అమ్మావాళ్ళు మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తారు. అంతవరకు నిదానంగా చదువుకోవటమే తనపని. అంతకు మించిన ఊహలు పోని వయస్సు మనస్సు సంధ్యది.



అందుకే అక్క అర్గ్యుమెంట్లను సంభ్రమంగా వింటున్నది.

నాన్నగారు అక్క పక్షమే. "ఎందుకు పాపం చిన్నపిల్లని అలా విసిగిస్తారు? శ్రద్ధగా చదువుకుంటున్న పిల్లని చదువు మానిపించి పెళ్లి చేస్తేకాని మీకు తోచదా? ఏమంత వయసు మించిపోయిందని ఈ హడావిడి?" అంటూ తేల్చిపారేశారు.

"ఇరవైయేళ్ల పిల్ల మీ కళ్లకు పసిపిల్ల!" అంది అమ్మ "అబ్బాయి ఇంజనీరు మంచి సంబంధం సుఖపడుతుందనే నా తాపత్రయంకాని..." గొణుక్కుంటూ లేచింది

"ఇప్పుడు నేనేంచేయను బావా? పిల్లను చూసుకోవటానికి రేపు మధ్యాహ్నం పెళ్లివాళ్లు వస్తామంటే సరేనన్నాను. ఇప్పుడు మీరు, మీ కూతురు ఇలా మాట్లాడుతుంటే నేనేంచేయను?" అన్నాడు మామయ్య

"నన్ను సంప్రదించకుండా నా పెళ్లి వ్యవహారం ఎందుకు పెట్టించుకున్నావు? మంచి పనయింది..." ఉడికించింది నిర్మల నవ్వుతూ

'పెద్దా, చిన్నా లేకుండా ఏమిటా నవ్వులు?" కసిరింది అమ్మ "రేపటి పెళ్లిచూపుల తతంగం అయిపోనీ ఆ తర్వాత ముందుకు పోవద్దు"

"నో ప్లీజ్ ఒక్కదానికి ఒప్పుకున్నానంటే ఇక నా పని గోవిందా! ఒక్కొక్క అడుగే వేయించి పెళ్లి దాకా లాగేస్తారు"

'లేదు నిమ్మీ నువ్వు ఇష్టపడని పెళ్లి నేనెప్పుడూ చేయనమ్మా అంతవరకు గ్యారంటీ ఇస్తాను" నవ్వుతూ అన్నారు నాన్నగారు

"ఇప్పుడు వాళ్లను రావద్దని కబురుచేసే టైమ్ లేదు. వచ్చాక నీవు లేకుంటే వాళ్లను అవమానించినట్టవుతుంది రేపటి ప్రోగ్రామ్‌కి మాత్రం నా మాట విను. తర్వాత వాళ్ళకి కాదని మెల్లిగా నేను చెప్పేస్తానుగా."

నాన్నగారి మాట కాదనలేక తలూపిందే కాని ముఖం గంటుపెట్టుకొని వెళ్ళిపోయిందక్కడి నుంచి నిర్మల

★ ★ ★

మర్నాడు ఆదివారం మధ్యాహ్నం రెండు గంటలవేళ. ఫ్రెండ్స్‌తో మార్నింగ్‌షోకి వెళ్ళిన నిర్మల ఇంకా తిరిగి రాలేదు అమ్మ,

నాన్న లోపలి గదుల్లో కునుకు తీస్తున్నారు.

ముందు గదిలో కూర్చొని చదువుకుంటున్నది సంధ్య. ఎవరో తలుపు తట్టారు. నిర్లిప్తంగా అనుకొని, "తీసేవుంది" అంది కూర్చున్న చోటినుంచి లేవకుండానే.

తలుపు విప్పుగా నెట్టుకొని ప్రవేశించిన వ్యక్తిని చూసి ఆశ్చర్యంగా లేచి నిల్చుంది. ఆ నిల్చోవటంలో ఒళ్లో పుస్తకం జారి పడింది చప్పుడు చేస్తూ.

అతను చాలా పొడుగ్గా, పొడుగుకి తగిన లావుగా ఉన్నాడు. అంత భారీ మనిషి గదిలోకి వచ్చేసరికి గదంతా నిండిపోయినట్లనిపించింది

అసలే సంధ్యకి క్రొత్తవాళ్ళంటే జంకు, ఆ క్రొత్తవాళ్ళు పురుషులయితే ఇక చెప్పక్కరలేదు. అందులోనూ ఇంతటి పర్సనాలిటీ గల వ్యక్తి ప్రవేశించేసరికి ఇక నోట్లోంచి మాటే రాలేదు

"నా పేరు విజయకుమార్" అతని గొంతు ఆకారానికి విరుద్ధంగా, మృదువుగా ఉంది.

"కూర్చోండి నాన్నగారిని పిలుస్తాను" తొట్రుపాటుగా అని లోపలికి వెళ్లబోయింది సంధ్య

"నేను వచ్చింది మీకోసమే. మీ ఫాదర్‌ని పిలిచే ముందర మనం కాసేపు మాట్లాడుకుందాం. మీరూ కూర్చోండి" అంటూ సోఫాలో కూర్చున్నాడు

సంధ్యకి అసలేమీ అర్థం కావటం లేదు. తన కోసం రావటమేమిటి? ఎందుకో

# ఇది ఒక పాంథశాల

బెదురుపోయి, 'ఇతని సంగతేమిటో తెల్సుకుందాం' అనే సరదా కలిగింది. 'నాన్నా' అని కాస్త గట్టిగా పిలిస్తే చాలు అమ్మా, నాన్న వచ్చేస్తారుకదా, భయపడటమేమిటి- అనుకొని తనూ కూర్చుంది.

జారి క్రిందపడిన పుస్తకం తీశాడతను. అది ఒక స్త్రీ వ్రాసిన తెలుగు నవల.

"రచయితలు, రచయిత్రులు ఎక్కువై పోవటం గర్వించవలసిన విషయమే కాని, ఈ రచనల క్వాలిటీయే బాధ కలిగించే విషయం!" అన్నాడు

"బాగుంది, అచ్చులో వచ్చిన ప్రతి పుస్తకమూ ఓ కళాఖండం అవుతుందా ? రచనల్లో చేవ ఉన్నవి నాలుగు కాలాలపాటు నిలుస్తాయి. లేనివి మరుగున పడిపోతాయి. రచనలు అసంఖ్యాకంగా రావటం ఎప్పుడూ సంతోషించవలసిన విషయమే" అంది సంధ్య

'మీరు ఎవరు ? నాతో మేంపని ?' అనే ప్రశ్నలు నాలుకపైన కదలాడుతూనే ఉన్నాయి. కాని సడన్‌గా అడగటం యిష్టంలేదు. అతన్నే చెప్పనీ, అని ఎదురు చూస్తున్నది.

పుస్తకం తిరగేస్తూ యథాలాపంగా పేజీ తీశాడు "ఈ వాక్యం చూడండి, 'ఆ దుర్మార్గుడు మంచివాడు కాడు' అన్నదీ, దుర్మార్గుడు మంచివాడవటమేమిటండీ ?"




నవ్వొచ్చింది సంధ్యకి. ఆపుకుంటుండగా మళ్ళీ చదివాడు

'అతని ముఖంలో కాళిమ అలుముకుంది'

"ఎవరయినా ఇలా మాట్లాడతారా మేడమ్ ?"

సంధ్య నవ్వేసింది "రచయిత్రుల తెలుగు గురించి రిసెర్చి చేస్తున్నారా మీరు? అయితే నేను రాంగ్ నెంబర్. నేను రచయిత్రిని కాను!"

"ఆ విధమైన ఇంటర్వ్యూకి నేను రాలేదని మీకూ తెలుసు. ఆఁ.. మీరు ఏం చదువుతున్నారు?"

"బి యస్సీ ఫైనల్ ఇయర్"

"తర్వాత ఎం. ఎస్సీ చదువుతారా?"

మీకెందుకు? అందామనిపించింది సంధ్యకు అయినా తమాయించుకొని "ఊహూఁ" అంది

"పై చదువుల్లో ఇంట్రెస్టు లేదన్నమాట!" సంధ్య ఏం మాట్లాడలేదు

"నాకూ అంతే లెండి మీ వద్దతే వచ్చింది సంసార పక్షంగా ఉండేందుకు ఎం. ఎస్సీలు, పి హెచ్ డి లు దేనికి?"

నీతులు బోధిస్తున్న పోజులో మాట్లాడుతున్న అతన్ని కాస్త ఒళ్లు మండింది సంధ్యకి. అతను చెప్పుకుపోతూనే ఉన్నాడు- "కెరీర్‌లో ఇంట్రెస్ట్ ఉన్న స్త్రీలు పెళ్ళిలోకి త్వరపడి దిగకూడదండీ .."

"ఇంతకూ మీ రెవరో, నా కిదంతా ఎందుకు చెప్తున్నారో కాస్త సెలవిస్తారా?" అతిమర్యాదగా అడిగింది.

తెల్లబోయినట్లు చూశాడతను ఓ నిమిషం ఆగి, "చెప్పాను కదండీ, నేను విజయ్‌నని"

"మీ పేరు మీకు ముఖ్యమైనదే కావచ్చు కాని విజయ్ అనగానే మీరు ఫలానా అని తెలిసేందుకు మీరేమీ జయప్రకాశ్ నారాయణో, మొరార్జీ దేశాయో కాదుగా?"

అతను మరింత ఆశ్చర్యంగా చూశాడు.

"పేరు చెప్పినా నేనెవరో తెలియదంటున్నారు మీరు. మీరు చెప్పకపోయినా మీ గురించి నాకు అంతా తెలుసు ... మీ నాన్నగారు భాస్కరరావుగారు, మీ మామయ్య సుబ్బారావుగారు...రైటేనా ?" తలూపింది సంధ్య.

"మీకు కోపం కాస్త ఎక్కువే కాని,




# మసాలా మామిడి

కావలసిన వస్తువులు — పెద్ద ఉల్లిపాయలు-2; ధనియాలపొడి - 1 టేబుల్ స్పూన్; అల్లం— చిన్నముక్క, వెల్లుల్లి రేకలు –6, మసాలాపొడి-1 టేబుల్‌స్పూను; చిన్నసైజు మామిడి కాయలు మరీ పులుపు కానివి 6 లేదా 8 కాయలు; (జీడితో ఉన్న కాయలు)

అల్లము వెల్లుల్లి మెత్తగా నూరాలి. ఉల్లిపాయలు సన్నగా తరగాలి. ఒక గిన్నెలో ఉల్లిపాయ ముక్కలు, అల్లము, వెల్లుల్లి ముద్ద, ధనియాల పొడి, మసాలా పొడి, తగినంత ఉప్పు, కారము, పసుపువేసి బాగా కలుపుకొని ఉంచుకోవాలి.

మామిడికాయను నాలుగు ముక్కలుగా చీరి మధ్య జీడిని తీసివేసి పైనకలిపి ఉంచుకొన్న మిశ్రమాన్ని కాయలో కూరి పెట్టుకోవాలి.

స్టౌమీద కుక్కరుపెట్టి నూనె పోసి కొద్దిగ బిరింజి ఆకువేసి కాగగానే మసాల కూరి ఉంచుకొన్న మామిడి కాయలువేసి బాగా మ్రగ్గిన పిదప కొద్దిగ నీరుపోసి మూతవేసి స్టీము రాగానే ఏడు నిమిషములు ఉంచి దింపివేయవలెను. పుల్లపుల్లగ కారము కారముగ ఉప్పు ఉప్పగ ఘుమఘుమ లాడుతు రుచిగా ఉండును.

— మాదిరెడ్డి, లక్ష్మీరమాపతి.

# "పడప్పాలు"

కావలిసిన వస్తువులు :— ఉప్పుడు బియ్యం-అరకిలో, నువ్వులు — అర్ధసావు, మినపప్పు - అర్ధసావు, ఇంగువ-కొద్దిగా, ఉప్పు — తగినంత, కారం — 4 చెంచాలు, కొబ్బరికోరు-1 చిప్ప, కరివేపాకు — 1 కట్ట !

తయారు చేయుట :— మొదట ఉప్పుడు బియ్యం నానబెట్టాలి. ఉప్పుడు బియ్యం నానేలోగ మినపప్పు వేయించి పిండి పట్టాలి. (లేదా మిల్లులో ఆడించాలి మెత్తటిపిండిని) తరువాత బియ్యం నానినాక గట్టిగా మెత్తగా గారెపిండిలా రుబ్బాలి. రుబ్బాక, అందులో ఈ ఆడించిన మినపపిండి కలపాలి. తరువాత ఈ పిండిలో వేయించిన కొబ్బరికోరు, (కొబ్బరికోరు వేయించాలి) నువ్వులు, ఇంగువ, కారం, ఉప్పు, కరివేపాకు వేసి, కొద్దిగా వేడినీళ్ళు పోస్తూ మెత్తగా గట్టిగా జంతికల పిండిలా తడిపెట్టుకోవాలి. తరువాత, బాణలిలో నూనె కాని, రిఫైన్‌డాయిల్ కాని పోసి, కాచి, ఈ పిండిని నూనె చెయ్యి చేసుకుంటూ చిన్న చిన్న బిళ్ళలులా (బిస్కట్లు సైజులో) పల్చగా చేత్తో వత్తుకుని ధీరగా దోరగా కరకరలాడేట్టుగా వేయించుకోవాలి. ఈ "వడప్పాలు" చాలా రుచిగా ఉండి, 2, 3 నెలలు చెక్కుచెదరకుండా నిలవఉంటాయి !

— జి. రామలక్ష్మి

---

మనసెంతో మెత్తన; మీ వయస్సు 20; మీరు బి. ఏ. చదువుతున్నారని విన్నాను. కాని, లేదు బి. యస్సీ అని అన్నారు. మీ పేరు నిర్మలాదేవి."

అప్పటికి కాస్త అర్థమయ్యింది సంధ్యకి. ఏదో అనబోయేటంతలోనే అతను మళ్ళీ అందుకున్నాడు.

"ఒకరి స్వభావాలు మరొకరికి గంటలో విమర్శమవుతాయి? కనక పెళ్ళిచూపులనే ప్రోగ్రాం కేవలం నాన్సెన్స్ అని చెప్పనవా వాదించేవాడిని నేను. కాని ఇక్కడకు వచ్చాక గంటకాదు, కనీసం అరగంటయినా కాదు, అరనిమిషం చాలు ఒకరిని అర్థం చేసుకోవటానికి అని తెలిసిపోయింది. మీరు నాకు నచ్చారు నిర్మలా! మొదటి తడవ మీ వైపు చూస్తేనే ఆ విషయం తెలిసిపోయింది నాకు. ఇక నన్ను మీరు మెచ్చారా, లేదా అనే పాయింటే తెలియాలి -"

అతనికి అడ్డువస్తూ "క్షమించాలి విజయ్‌కుమార్ గారూ! నా పేరు సంధ్య; నిర్మల మా అక్కయ్య" అనేసి రివ్వున లోనికి పారిపోయింది సంధ్య.

క్రొత్తగా వెల్లవేసిన గోడ నెప్పుడైనా చూశారా? అదిగో, అలాగే అయింది విజయ్ ముఖం !

... ... ... ... ...

నిలువుటద్దం ముందు తీరికగా నిలబడి ప్రతిబింబాన్ని చూసుకోసాగింది సంధ్య. నిర్మలవలె పసిమి రంగు కాదు తనది. కాస్త నలుపు అనే చెప్పాలి. ప్చ్! పసిమి వర్ణం బాగుంటుంది...

కళ్ళు పెద్దవి, నోరు చిన్నది వంటి ఫీచర్స్ ఏవీ లేవు తనకి. కనీసం పొడవైన జడకూడా లేదు. జుట్టు నల్లగా, ఒత్తుగా ఉన్నా సదుము పైకే ఉంటుంది. నిర్మలది పొడవైన జుట్టు. కాని ఫాషన్ కోసం సగానికి పైగా కత్తిరించి ఓ రబ్బర్ బాండ్ పెట్టుకుంటుంది.

కాని తన ముఖం కళగా వుంటుందని చాలామంది అంటారు, అసలు 'కళ' అంటే ఏమిటో? నిర్మలకు ఉన్న రంగు, అందము, చురుకుదనం తనలో లేవనేమాట మాత్రం నిజం. తనూ అక్కలాగా ఉంటే బాగుండును... కాని అదెలా సాధ్యం ?

అక్క కాలేజి డ్రామాల్లో వేస్తుంది. డిబేట్స్‌లో పాల్గొంటుంది. తనకు మాత్రం అటువంటి వంటే జంకు.

అక్కని మెచ్చుకోగలదు కాని, అట్లా ఉండలేదు.

తనలో ఆకర్షణ అనేది వుంటే ఒక్క ఫిగర్‌లోనే ఉంది. ఆ విషయమయినా అక్క చెప్పేవరకు తనకే తెలీదు.

ఓసారి తమ కాలేజిలో ఫాషన్ పెరేడ్ ఏర్పాటు చేశారు. మాటల సందర్భంలో అక్కకి చెప్పింది తను. "నువ్వు పార్ట్ తీసుకోవాలి సంధ్యా" అంది నిర్మల.

"అందంగా ఉండే అమ్మాయిలే తెలుసా అందులో పాల్గొనేది !" నవ్వుతూ అంది తను. "నీవు మా కాలేజి స్టూడెంట్ వయితే ప్రైజు కొట్టేసేదానివి."

"నా ముఖం ఏంత కళగా ఉంటుందని ! అందులోనూ ఇటువంటి పోటీలలో చూసేది ఫిగర్— అది నీకు ఉంది !"

# ఇది ఒక పాంథశాల

తన ఎత్తు అయిదు అడుగుల మూడు అంగుళాలు. అందరి ఆడపిల్లలలాగే ఏషోజాలు ఎత్తుగా, నడుము సన్నగా ఉంటుంది కాని, అది తనకు చాలా పర్‌ఫెక్ట్‌గా ఉన్న విషయం మాత్రం తెలియదు

అక్క బలవంతం మీద 'పెరేడ్' రోజున లైట్ బ్లూ బిన్నీ సిల్క్ చీర కట్టుకుంది. కుచ్చెళ్ళన్నీ పైన ఒకదగ్గిరగా చేర్చి క్రింద విసినికర్రలా విచ్చుకునేటట్లు సర్దింది అక్క. చిన్న తిలకం, కళ్ళకు కాటుక, చెవులకు ప్రేలాడే బుట్టలు, మెడలో లాకెట్ గొలుసు, తలారా స్నానం చేశాక అల్లిన జడలో సన్నజాజులు— సింపిల్‌గా డ్రస్ అయింది. ఒళ్ళంతా కప్పేటుందన్న మాటే కాని, చీర చూపినట్లు శరీరపు వొంపులు మరే డ్రస్సు చూపలేదు కాకపోతే జుగుప్స కలిగించకుండా, చీప్ అనిపించకుండా వొంపులు చూపగలగటమే చీర ప్రత్యేకత!

పెరేడ్‌లో పాల్గొంటున్న అమ్మాయిలను చూస్తే అదురు పుట్టింది తనకు. లుంగీలు, బెల్‌బాటమ్‌లు, పంజాబీ డ్రస్‌లు, మినీ స్కర్ట్సు, స్లీవ్‌లెస్ డ్రస్సులు, బొడ్డు క్రిందకు కట్టిన చీరలు, పెదాలకు రంగులు, గోళ్ళకు రంగులు, మేకప్‌లు, కిలకిలా నవ్వులు, హుషారుగా గంతులు— పేరకపోయి పేరు ఇచ్చాననుకొని బాధపడింది అక్కను కసితీరా మనసులోనే తిట్టుకుంది

"ఆర్. సంధ్యారాణి" పేరు పిలిచారు.

తడబడే అడుగులతో స్టేజి పైకి వచ్చింది స్టేజి పైకి ఫ్లడ్‌లైట్స్ వెలుగు తూండటం వలన అవతల అంతా చీకటిగా కనబడింది ప్రేక్షకులు కనబడలేదు

బెదురు చూపులతో అలాగే నిలబడి పోయింది. స్టేజి పైకి వచ్చినవాళ్ళు డేన్సో, పాటో, పద్యమో, చిన్న స్పీచో ఇవ్వాలి

సంధ్య అలా చూస్తూ రెండు నిమిషాలు నిల్చుండి పోయింది.

ఆడియన్స్‌లో నుంచి చిన్నగా మాటలు, గొడవ మొదలయినాయి.

తను ఏం చెప్పదల్చుకుందో మరచి పోయిన సంధ్య, తెలివి తెచ్చుకున్నట్లుయి రెండు చేతులూ జోడించి "నమస్తే" అంది. తర్వాత ఏమనాలో గుర్తు రావటం లేదు. [illegible]మయిపోయినట్లు చిన్నగా గంట మ్రోగింది స్టేజి దిగి వచ్చేసింది

తర్వాత తనకు ఫస్ట్ ప్రైజ్ అనౌన్స్ చేసినప్పుడు కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు.

ఇంటికి వస్తూనే ప్రైజ్ కప్పు నిర్మల ఒళ్ళో పడేసి "ఫస్ట్ జన్మలో స్టేజి ఎక్కను!" అంది.

ఆ రోజు నించి సంధ్యలో ఏదో మార్పు. చిన్నప్పటి నుంచి అక్కతో పోల్చుకొని పెంచుకుంటూ వచ్చిన ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ కాస్త వెనక్కి పోయినట్లే అయింది కాని తనకు ప్రైజ్ రావటం ఏదో ఫ్రెండ్ లక్ వలననే కాని, తనలో నిజంగా ఆకర్షణ ఉండి కాదు, అను కుంటుంది తరచు.

చుక్కలమధ్య వెలిగే చందమామ నిర్మల. ఒంటరిగా మినుకు మినుకుమనే మిణుగురు పురుగు తను.

ఎప్పుడూ సైలెంట్‌గా ఉండే తను విజయ కుమార్‌తో అంతగా మాట్లాడటం తనకే వింతగా ఉంది

అతనికి తను నచ్చటం మరీ వింత!

నాన్నగారికి మాత్రం అతను నచ్చలేదు. పహిల్వాన్‌లాగా ఉన్నాడు – నా కూతురికి సరిపోయే రాజకుమారుడు కాదు పొమ్మన్నాడు.

నిర్మలకు పెళ్ళి చేయకుండా సంధ్య పెళ్ళి మాట తలపెట్టటం అమ్మకు ఇష్టంలేదు.

పెళ్ళి అనుకోవటమే నిర్మలకు యిష్టం లేదు

మర్నాడు మామయ్యకు విజయ్ పెద్దలు చెప్పారట, రెండో అమ్మాయి పట్ల ఆసక్తి చూపిస్తున్నారని తను ఇంట ఎవరూ ఉత్సాహం చూపలేదు. ఇక విజయ్‌కు తనూ, తనకు విజయ్ నచ్చితేమాత్రం ఏం ప్రయోజనం ?

తనకు విజయ్ నచ్చాడా ?!

బుగ్గల్లోనించి వెచ్చని ఆవిరి చిమ్మినట్లే అయింది

పరుపుపైన బోర్లాపడుకొని మనసు మళ్ళించాలని ప్రయత్నిస్తుంటే, చెప్పిన మాట వినకుండా నోరు కూనిరాగాలు తీయసాగింది.

(ఇంకా వుంది)

# మీ పసిపాపను గమనించండి









# సిరిలాక్®
## తో కలుగుతుంది

ఇది పాపకు పుష్టికరమైన
సంపూర్ణ ధాన్యపు పిండి ఆహారం.

పాలు, పంచదార...ప్రేమతో
పరిపూర్ణమైనది.




దీనిని తయారుచేయడం చాల తేలిక-దీనితో నీరు చేర్చండి-అంతే



ముందుగా
మరగబెట్టిన నీటితో
సిరిలాక్ చేర్చండి



బాగా కదపండి.



వెంటనే
యిచ్చేందుకు
తయారు.

మీ పాపకు 3 నెలలు వచ్చేశాయా? అయితే మీ పాప నిండుగా పెరుగుటకు యిప్పుడు చక్కని సమపాళ్ళ దిట్టమైన ఆహారం చాలా అవసరమైవుంది.

సిరిలాక్ పాపలకు పుష్టికరమైన సంపూర్ణ ధాన్యపు పిండి ఆహారం ఇది యెంతో రుచికరమైనది ధాన్యపు పిండి, పూర్తి మీగడపాలు, పంచదారతో తయారైనది మీ పాప పెరుగుదలకు అతి ముఖ్యముగా అవసరమైన పుష్టిని పూర్తిగా యిస్తుంది

ఇందులో

- మీపాప ఆరోగ్యంగా వుండుటకు కావలసిన క్రొవ్వు పదార్థములు కార్బోహైడ్రేట్లు సరియైన సమపాళ్ళలో వున్నవి
- మీపాప అనుదినం పెరుగుటకు తగినంత ప్రోటీనులు వున్నవి
- మీపాప తేజముగ వుండుటకు అదనపు విటమినులు మరియు యినప శక్తి వున్నవి

-NESTLÉ

SAA/FSL/G/1043/TEL

## హైదరాబాద్ నోట్‌బుక్

**తులసీ మానసనళినం :—**

ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృతశాఖలో రీడరు శ్రీమతి నళినీసాధలే (పరాడ్కర్) తులసీదాసు హిందీ రామాయణం రామచరిత్ర మానస్‌ను తులసీ మానస నళినం అనే పేరుతో సంస్కృతంలో అనువదించారు దీని ఆవిష్కరణోత్సవం పూనాలో ఏప్రిల్ 1వ తేదీన వైభవోపేతంగా జరిగింది దేశ విదేశాలలో సంస్కృత ప్రచారానికి నెలకొన్న శారదా జ్ఞానపీఠం పక్షాన శారదా గ్రంథమాల వారు తులసీ మానసనళినం ప్రచురించి, ఆవిష్కరణోత్సవం ఏర్పాటు చేశారు ప్రధాని శ్రీ మొరార్జీదేశాయ్ తులసీ మానసనళినంను ఆవిష్కరించారు విద్యావంతులైన ప్రేక్షకులు వేలాదిమంది హాల్లోని చీమచిటుక్కుమన్నా వినిపించేంత నిశ్శబ్దంగా వుండి విన్నారు లోకనాయక్ శ్రీ జయప్రకాశ్‌నారాయణ్ ఆరోగ్యం కోరుతూ ప్రారంభంలో ప్రార్థనలు జరిగాయి ఈ ప్రార్థన తులసీ మానసనళినంలోని ఇంద్రాదిదేవతలు విష్ణువును ప్రార్థించిన 'జయ జయ జయసురనాయక జనసుఖదాయక' శ్లోకాలతో ప్రారంభమయింది శారదా పత్రిక సంపాదకుడు, సుప్రసిద్ధ సంస్కృత కర్త శ్రీ వసంత అనంతగాడ్గిల్ స్వాగతవచనాలు పలికిన తర్వాత శారదా జ్ఞానపీఠం అధ్యక్షుడు శ్రీ మరాఠే తమ సంస్థ వివరాలు తెలిపారు మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ శరద్‌పవార్ ప్రసంగించిన పిమ్మట ప్రధాని గ్రంథం ఆవిష్కరిస్తూ, రాముడు తన పూజ చేసుకోలేదంటూ, తమ పూజలో నిమగ్నులయిన వారిపై విసుర్లు విసిరారు ఇప్పటి వారికి రామాయణ భారతాలను గురించి చాల తక్కువగా తెలుసునని ప్రధాని అన్నారు

ఎమర్జెన్సీలో జైలులో వున్నప్పుడు తాము ఐదుసార్లు తులసీదాసు రామాయణం పారాయణం చేశామన్నారు రామచరిత మానసాన్ని సంస్కృతంలో తొలిసారిగా అనువదించినందుకు శ్రీమతి నళినిని ప్రధాని ప్రశంసించారు పిదప శ్రీ గాడ్గిల్ ద్వారకా శంకరాచార్యులు శ్రీమతి నళినీసాధలేకు 'కవికోకిల' అనే బిరుదం ఇచ్చినట్టు ప్రకటించారు. శ్రీమతి సాధలే సంస్కృత శ్లోకాల్లో కృతజ్ఞత ప్రకటించారు పూనుకున్న ఈ పని దుస్సాధ్యమయినప్పటికీ, ఏదో కొద్దిగా రఘునాయకుని కృపవలన పూర్తి చేశాను —

"ప్రరి పన్నార్థ నిర్వాహో
దుస్సాధ్యోప్యంశతో హ్యయమ్,
సంపన్నో యత్కృపాలేశాత్
తం వందే రఘునాయకమ్ "

అని అన్నారు సభను గవర్నర్ శ్రీ సాదిక్‌అలీ, బొంబాయి మేయరు మున్నగు ప్రముఖులు హాజరయ్యారు మేయర్ కవయిత్రిని అభినందించారు.

**ఉపశ్రుతి :—**

"మన వాళ్లకు భక్తి క్రమశిక్షణ రాదు" అన్నారు ఒక పెద్దమనిషి బస్సు వద్ద తొక్కిసలాడుతున్న జనాన్ని చూసి "ఎలా వస్తుంది? మనం ఎలాంటి వాళ్లం?" అన్నారు మిత్రుడు మరింగంటి రంగాచార్యులు 'వివరించండి సార్' అన్నారు ఇంకొకరు మరింగంటి వారు తిరుమంత్రార్థం చెబుతున్నట్టు జ్ఞానముద్ర అవలంభించి చెప్పారు. "పూర్వం శ్రీ రామచంద్రుడు వనవాసం వెళ్లేప్పుడు సరయూతీరం వరకు అయోధ్యావాసులు ఆయన వెంట వెళ్లారు రాముడు రావద్దని ప్రార్థించగా కొందరు వెనక్కు తిరిగివెళ్లారు కొందరేమో భక్తితో ఆయన వెంట వెళ్లారు కొందరు సరయూ తీరంలోనే చతికిలబడ్డారు, వోపికచచ్చి ఆ మధ్యస్థుల సంతతివారం మనం మనకు చెబితే వినే క్రమశిక్షణా లేదు, తరింపజేసే భక్తీ లేదు "

—తిరుమల రామచంద్ర

### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన అందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం

# పాపం, దీనికి అమ్మా నాన్నా లేరు, మనం పెంచుకుందామా!



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే
## ***రీగల్*** కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం. అందుకు 'రీగల్' మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు 'రీగల్'కు గల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది. లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల—శక్తివంతమైన—నురుగునిచ్చేది 'రీగల్' ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్,' మీకు ఎంతో పొదుపు చేస్తుంది.
'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి




Rediffusion D/767e/TL/R

# జీవిత



# మాధుర్యం

సీరియల్

యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

"ఓకే వదండి. నాకు తల దిమ్ముగా వుంది మిమ్మల్ని దిగబెట్టి నేను అక్కడనుంచి మా ఇంటికి పోయి రెస్టు తీసుకుంటా ఇవాళ అనుకోకుండా నేను కాస్త ఎక్కువే లిక్కరు పుచ్చుకున్నాను" అన్నాడు వినోద్

అరుంధతి ఆ వరండామీంచి వెళ్ళి క్లబ్బు ఆవరణలో చెట్టు క్రింద పార్కుచేసున్న వినోద్ కారు వద్దకు పోయి, ఫ్రంటు సీటులో కూర్చుంది వినోద్ కారును మెల్లగా అరుంధతి ఇంటివైపుకు పోనిచ్చేడు

వినోద్ తాపీగానే కారును నడిపేడు. నడుపుతున్నంతసేపు శక్తినంతట్నీ కూడదీసుకుని దృష్టి చెదిరిపోకుండాచేసి జాగ్రత్తగా నడపవలసి వచ్చింది అరుంధతి యొక్క బంగళా చేరగానే 'అమ్మయ్య సాధించేను' అనుకున్నాడు

అరుంధతి కారు దిగి – "రండి వినోద్ కాస్సేపు కూర్చుని వెళ్దురుగాని. ఈ స్థితిలో మీరు డ్రయివుచేసుకుంటూ అంత దూరంలోనున్న మీ ఇంటికి వెళ్ళడం అంత క్షేమం కాదు. కాస్సేపట్లో తల దిమ్ము తగ్గిపోతుంది -- అప్పుడు వెళ్దురుగాని," అని వినోద్ వైపున్న కారు తలుపును తెరచి ఆహ్వానించింది. వినోద్‌కి ఆ మాట నిబబుగానే తోచింది నిజానికి అతడు కారును సరిగా డ్రయివు చేసే స్థితిలో లేడు. ఏ ప్రమాదం చెయ్యకుండా అరుంధతి ఇంటికి చేరుకోవడమే ఆశ్చర్యకరమైన విషయం.

"సరే - అలాగే కాస్సేపు ఉండి వెళ్తాను," అని వినోద్ కారు దిగేడు.

అరుంధతి వినోద్ చెయ్యి పట్టుకుని మెల్లగా నడిపించి మేడమీదనున్న తన గదిలోకి తీసుకుపోయింది క్రింద హాలులో ఎవరో నౌకరున్నాడు గాని వాడు చూసి చూడనట్లు ఊరుకున్నాడు తలెత్తి ఎగాదిగా చూస్తే తనని వెంటనే అమ్మగారు బర్తరపు చేస్తారని వాడికి తెల్సు. మంచి జీతమూ తక్కువ పని ఇచ్చే యజమానుల్ని వదులుకుందుకు ఎవరికిష్టముంటుంది!

వినోద్‌ని సరాసరి తీసుకుని వెళ్ళి తన మంచంమీద కూర్చోబెట్టింది అరుంధతి అప్పటికి వినోద్‌కి బాగా మత్తు యెక్కింది. రెస్టు తీసుకో వినోద్ అని మెల్లగ ప్రేమగా వినోద్‌ని మంచం మీద వాల్చింది వినోద్ అభ్యంతరం చెప్పే స్థితిలో లేడు పైగా ఆ అందమైన స్త్రీని ఎక్కడో చూచినట్లు అనిపిస్తోంది ఆ మధురమైన

(గత సంచిక తరువాయి)

కంఠం తనకి పరిచితమైనదనిపిస్తోంది.

మంచంమీద వాలి కళ్ళు మూసుకున్నాడు తలలో ఏదో రొదగా ఉంది. క్రింద సిల్కు దుప్పటి, మెత్తని డన్‌లప్ ఫోమ్ పరుపు, తలగడ చల్లగా హాయిగా తగుల్తున్నాయి వినోద్‌కి

అరుంధతి వినోద్ పరిస్థితికి సంతోషించి మెల్లగ వార్డు రోబ్ దగ్గరకు వెళ్ళి తన బట్టలన్నిటిని విప్పేసి పైన ఓ సిల్కు గౌను మాత్రం వేసుకుంది. బీరువాలోనుంచి జిన్ సీసా తీసి గ్లాసులో ఓ పెగ్గు వేసుకుని త్రాగేసింది. తరువాత రిఫ్రిజిరేటరునుండి లిమ్కా తీసి గ్లాసులో పోసి, మెల్లగ వినోద్‌ని మంచంమీద కూర్చోబెట్టి "వినోద్! ఈ లిమ్కా త్రాగు మత్తు కాస్త తగ్గిపోతుంది," అని అతడిచేత లిమ్కా త్రాగించింది.

వినోద్ కళ్ళు విప్పి జాగ్రత్తగా చూసేడు. ఎదురుగా అందమైన మృదువైన స్త్రీ ఉంది. ఆమె వేసుకున్న సిల్కు గౌనుకు మధ్యన ఒక్క బండీ మాత్రమే పెట్టుకుని ఉండడంవల్ల ఆమె వొంపుసొంపులు నిండుగా అగుపిస్తూ ఊరిస్తున్నాయి చేతులు కాస్త బొద్దుగా, గుండ్రంగా, నున్నగా అందంగా ఉన్నాయి పొట్ట పలుచగా మృదువుగా తోస్తోంది తనెక్కడున్నాడో ఆ యువతి ఎవరో వినోద్‌కి తెలియడంలేదు

"డార్లింగ్--ఈ టైని కోటుని విప్పేస్తాను. హాయిగా ఉంటుంది నీకు," అని మెల్లగా వినోద్ టైని, కోటుని తీసేసి కుర్చీపైన పడేసింది.

అందంగా కామదేవతలా నించున్న ఆ యువతిని కష్టంమీద కళ్ళు బాగా తెరిచి చూచేడు ఆమె పలుచని సిల్కు గౌను ఎలాగో పిరుదులను దాటి ఓ మూడించీలు దిగి వుంది. ఆమె నునుపైన తొడల్ని, చక్కని కాళ్ళను చూచేసరికి వినోద్‌లో వేడి కల్గింది కోరిక మెల్లగా ప్రబలింది.

అప్పుడు బోధపడింది – అది తన బంగళాలోని తన పడకగదని, ఆ యువతి తన ప్రియురాలు లావణ్యని. తన అపరాధం తెల్సుకుని తనని క్షమించమని అడగడానికి ఈవిధంగా ఆకర్షణీయంగా ముస్తాబై వచ్చిందని

వినోద్ మెల్లగా నిలచుని "రా లావణ్యా - నిన్ను ఏనాడో నేను క్షమించేను - నీమీద నాకేమి

**జరిగిన కథ - 14:** బ్రతికిచెడ్డ భూషణం కుటుంబం చేసుకోబోయిన ఆత్మహత్యా ప్రయత్నం వినోదమూర్తి రాకవల్ల విఫలమవుతుంది. వాళ్లను ఆదుకొనటానికి తోటను కౌలుకు తీసుకొని కొన్నాళ్ళు అక్కడే వుండాలనుకుంటాడు వినోదమూర్తి. లోగడ ఆస్తిలో తన వాటా తీసుకొని దుర్వ్యసనాలకు లోనై, సినీతార తిలోత్తమ వ్యామోహంలో పడతాడు భూషణం తమ్ముడు చక్రవర్తి. ఆస్తి అంతా హరించగా భార్య నిరాదరణతో కృశించి మరణిస్తాడు. వ్యాపారంలో కలిసిరాక భూషణం అప్పులపాలవుతాడు. కౌలుకి తీసుకున్న స్థలంలో కొంతమేర కూరగాయలకు కేటాయించి, మిగిలిన స్థలంలో ఫౌండ్రీ పెట్టడానికి ప్రయత్నాలు చేస్తుంటాడు వినోదమూర్తి. 'విశాలా వెజిటబుల్ ఫారం', 'సుకుమార్ ఇండస్ట్రీస్'ల ప్రారంభోత్సవ సన్నాహాలతోపాటు; వినోదమూర్తి, లావణ్యల మధ్య ప్రేమ వికసిస్తుంటుంది వారి ప్రేమ ఏ విధంగా పరిణమిస్తుందోనని భూషణం దంపతులు ఆందోళన చెందుతారు ఇరువురి కుటుంబ విషయాలూ పరస్పరం తెలుసుకున్న అనంతరం వినోద్ లావణ్యను పెండ్లి చేసుకుంటానని మాట యిస్తాడు ఈలోగా ఇంటినుండి వచ్చిన ఉత్తరాలను అందుకుంటాడు. లోగడ ఇచ్చిన అప్పును తనద్వారా వసూలుచేయ ప్రయత్నించిన మదన్‌లాల్‌ను అతను మందలిస్తాడు. అప్పు తీర్చి తనఖా దస్తావేజులు తీసుకొని, మేనమామ కూతురు అరుణ వ్రాసిన ఉత్తరం చూచిన లావణ్య తనని నిందించగా వినోద్ తన యింటికి వెళ్ళిపోతాడు. తమ్ముడు అశోక్‌పట్ల అరుణ విముఖముగా ఉన్నదని తెలుసుకొని, పాత స్నేహితులను కలవటానికి క్లబ్బుకు వెళ్తాడు వినోద్. భూషణం మనస్సులో వినోద్‌పై రామకింగం నాటిన విషబీజాన్ని విశాల, సుకుమార్‌లు త్రుంచేస్తారు లావణ్యపై గల ప్రేమ కారణంగా అరుణను వివాహమాడలేనని తల్లి కమలాదేవికి, అశోక్‌కి వినోద్ ఖండితంగ చెప్పిన విషయాన్నే అరుణకు చెప్తూ తానామెను ప్రేమిస్తున్నానని వెల్లడిస్తాడు అశోక్ వినోద్ లావణ్యను తప్ప వివాహమాడడని తెలుసుకున్న మేనమామ నందనరావు నిరీక్షకటాడు. మనస్సు బాగోక త్రాగి మత్తులోనున్న వినోద్‌ను తన కోర్కె తీర్చుకునే ఉద్దేశ్యంతో తన యింటికి తీసుకువెళ్లమంటుంది అరుంధతి.



# జీవిత మాధుర్యం

కోపంలేదు - నువ్వంటే నాకెంతో ప్రేమ – రా,'' అని చేతులు జాచేను. అరుంధతి ఆనందంతో ఉప్పొంగి ఒక్క అంగలో వినోద్‌ని చేరి వినోద్ చేతుల్లో గువ్వపిట్ట అయిపోయింది

''వినోద్ – నేనంత లావణ్యంగ వున్నానా?''

''అవును – నువ్వు నా లావణ్యవే,'' అని వినోద్ అరుంధతిని తన కౌగిలిలో నలిపేస్తూ ఆమె నుదుటిని, కళ్ళను, చెంపలను, పెదవులను, మెడను ఉద్రేకంగా ముద్దుపెట్టుకోనారంభించేడు

## 19

ఆ రెండో డాన్సు పూర్తికాగానే అరుణ కళ్ళు అరుంధతికోసం, వినోద్‌కోసం వెతికేయి ఆ ఇద్దరూ ఆ డాన్సు హాలులో కనుపించలేదు అరుణ ఆ క్లబ్బు ఆవరణంతా వెతికింది కాని వాళ్ళు కనుపించలేదు సందేహంకల్గి బయట చెట్ల దగ్గరకు వెళ్ళి వినోద్ కారుందేమో చూసింది. వినోద్ కారు లేదు. అరుణ ఆందోళన ఎక్కువకాజొచ్చింది.

''అశోక్ – వినోద్, అరుంధతి కనుపించడం లేదు. వినోద్ కారు లేదు. ఇద్దరూ ఎక్కడికేనా వెళ్ళారేమో – నీకేమైనా తెల్సునా ?''

''నాకేమి తెలియదే – క్లబ్బులో అర్ధగంట క్రితం చూసేను, అంతే.''

అరుణ గేటు వద్దకు వెళ్ళి అక్కడున్న కాపలాదారును అడిగింది. వాడు చూసింది చెప్పేడు

''వినోద్‌బాబుగారు, అరుంధతిదేవిగారు కారులో వెళ్ళిపోయేరండి. సుమారు అరగంట అవుతుందండి.''

అరుణ హృదయంలో తీవ్రమైన సంచలనం కలుగనారంభించింది తను చూడని, తను ఎరగని లావణ్యను వినోద్ ప్రేమిస్తున్నాడని, తనని కాక లావణ్యను వివాహం చేసుకుంటానంటున్నాడని అశోక్ చెప్పినప్పటికి అరుణ అంతరాంతరాల్లో చిన్న ఆశ వుండేది – వినోద్ మనస్సు మార్చుకుని తనని ఆదరిస్తాడని వినోద్ గుణంమీద అరుణకు గట్టి నమ్మకముండేది.

కాని ఈనాడు చంచలస్వభావురాలైన అరుంధతితో వినోద్ చేతులు కలిపి అరుంధతిని తన కారులో తీసుకునివెళ్ళడంటే ఇందులో ఏదో కుంభకోణ మున్నదని అరుణ అనుమానపడ్డది పైగా లోకనాథం కేంపుకు వెళ్ళేడని విన్నది. అరుంధతిని వినోద్ తనింటికి తీసుకువెళ్ళేడేమో ! అలా వీలుపడదు అతడి ఇంటివద్ద అతడి తల్లి, చెల్లెలు వున్నారు. బహుశా వీళ్ళిద్దరూ అరుంధతి బంగళాకు పోయుంటారు. అరుణ ఏమేమో ఊహించుకుని బాధపడజొచ్చింది.

మరి మనసుండబట్టక అరుణ అశోక్‌ని తనని కారులో అరుంధతి ఇంటికి తీసుకువెళ్ళమని కోరింది.

''అరుణా ఎందుకు పోనిద్దూ గొడవ. వాళ్ళెక్కడికి వెళ్తే మనకెందుకు చెప్పు పద మరోసారి డ్యాన్సు చేద్దాం.''

''అలా వీల్లేదు. నేను అరుంధతి ఇంటికి వెళ్ళితీరాలి. నువ్వు నీ కారులో నన్ను తీసుకొని వెళ్ళకపోతే నేను టాక్సీలో వెళ్తా,'' అని క్లబ్బు గుమ్మాలు దిగింది.

''ఆగు అరుణా! నేను వస్తున్నా నా కారులో పోదాంలే,'' అని అశోక్ అరుణను తన కారు వద్దకు తీసుకునివెళ్ళేడు.

అరుణ, అశోక్ అరుంధతి ఇంటికి చేరేసరికి వినోద్ కారు పోర్టికోలో వుంది. అరుణ గుండెలు త్వరగా కొట్టుకోనారంభించేయి. ఆమె అనుమానం దృఢపడజొచ్చింది అరుణ, అశోక్ తొందరగా ఇంట్లోకి వెళ్ళి హాలులో ఎదురైన నౌఖరుని అడుగుతే అమ్మగారు, బాబుగారు మేడమీద వున్నారని చెప్పేడు. అరుణ, ఆమె ననుసరిస్తూ అశోక్ మేడమీదకు వెళ్ళి అరుంధతి గదిని చేరి గది ద్వారానికున్న కర్టను ప్రక్కకు తొలగించి చూద్దురుకదా వినోద్ అరుంధతిని ఉద్రేకంతో ముద్దుపెట్టుకుంటున్నాడు. అరుంధతి మోహంతో, కాంక్షతో వినోద్‌ని పెనవేసుకుంటూంది.

అరుణ ఆ దృశ్యాన్ని చూసి కొయ్యబారిపోయింది. అశోక్ కూడ కలనైనా తలవలేదు వినోద్ వివాహితయైన అరుంధతితో ఈవిధంగా సంబంధం పెట్టుకుంటాడని. ఇంకా ఆలస్యంచేస్తే అరుణ ఆవేశంతో పరిస్థితిని మరింత పాడుచేసి, అరుంధతి ఇంట్లో ఏ రసాభాసు చేస్తుందేమోనన్న భయంతో మెల్లగా అరుణ రెక్కపట్టుకుని లాగి గబగబ ఆ ఇంటి నుండి ఆమెను బయటకుతెచ్చి కారులో కూర్చోబెట్టేడు. అరుణ ఇంటివైపుకు కారును పోనిచ్చేడు.

అరుణ దుఃఖాన్ని మరి ఆపుకోలేకపోయింది. ఏడుస్తూ అశోక్ భుజంమీద వాలిపోయింది.

''అరుణా ! నిగ్రహించుకో – ఏడవకు,'' అని అశోక్ సముదాయించబోయేడు. కాని అరుణ దుఃఖం కట్టలుతెగిన వాగులా ప్రవహిస్తూంది.

''బావా ! అన్యాయం జరిగిపోయింది. వినోద్‌ని నేను ఓ దైవపురుషుడిగా ఇన్నాళ్ళూ ఆరాధించేను. నా భావనంతా బుగ్గిఅయింది. వినోద్ ఇంత గుణహీనుడని నేననుకోలేదు. ఎంత మోసం ! ఎంత కుచ్ఛితం ! నా బ్రతుకుని పాడుచేసేడు,'' అని మరింత రోదించింది.

చేసేదేమీలేక ఆమె హృదయవేదన అలా కన్నీళ్ళరూపంలో కరిగిపోనీ అని అశోక్ ఊరుకున్నాడు

వినోద్ అరుంధతిని లావణ్య అనుకుని ఆ మత్తులో ఆమెను మరింత గట్టిగా కౌగలించు కున్నాడు. ఇంతలో గదిలో వున్న టెలిఫోను మ్రోగింది ఆ ధ్వనికి గతుక్కుమని అరుంధతి, వినోద్ విడిపోయేరు. అరుంధతి కోపంతో వెళ్ళి టెలిఫోను ఎత్తింది. విజయవాడ నుంచి ఆమె భర్త లోకనాథం ఫోనుచేసేడు.

''హలో అరూ — ఏంచేస్తున్నావు, క్లబ్బుకు వెళ్ళలేదా ?''

ముఖంలో అమితమైన కోపంవున్నా గొంతుకలో మార్దవం తెచ్చుకుని—

''లేదు డార్లింగ్ — మీరు లేకపోతే ఇవాళ ఎందుకో వెళ్ళబుద్ధవలేదు. ఏదో నవల చదువుకుంటూ కూర్చున్నాను.''

వినోద్ మెల్లగా మంచంమీద కూర్చున్నాడు. ఆ టెలిఫోను గంట అతడి మత్తును కాస్త సడలించింది. తన లావణ్య ఫోనులో ఎవరితోనో డార్లింగ్ అని మాట్లాడుతుండడం చాలా ఆశ్చర్యం కల్గించింది. తన లావణ్య ఎవరితో మాట్లాడుతుంది చెప్మా! ఇంతకీ తను ఎక్కడున్నట్లు ?

అరుంధతి ఫోనులో మాట్లాడుతుంటే వినోద్ మెల్లగా ప్రక్కనున్న బాత్‌రూములోకి వెళ్ళేడు. అక్కడున్న చల్లని నీళ్ళతో ముఖం కడుక్కొని ముఖాన్ని చేతితో రుద్దుకున్నాడు. చెంపల్ని, మెడని చల్లని నీళ్ళతో తడిపేడు. ఆశ్చర్యం! అది తన బాత్‌రూమ్ కాదు. బాత్‌రూమ్ తలుపు తెరచి గదిలోకి వచ్చేడు. ఆ గది తనది కాదు. ఆమె ఎవరు? — తన లావణ్య కాదే — ఎవరు ? అరుంధతి !

వినోద్ కాళ్ళు వణకనారంభించేయి మెల్లగా వెళ్ళి దగ్గరలోనున్న కుర్చీలో కూలబడ్డాడు ఏదో భయంకల్గింది. అదేమిటి అరుంధతి చాలామట్టుకు లావణ్యగా వుంది. అయితే ఇంతసేపూ తను లావణ్య అనుకున్నది అరుంధతినా!! ఛీ! ఛీ! ఎంత పాడుపని చేసేడు. శక్తినంతా కూడదీసుకుని లేచి నించుని తన టైని, కోటుని అందుకున్నాడు. అరుంధతి వినోద్‌ని కనిపెడ్తూనేవుంది. వినోద్ చర్య ఆమెకు ఆశ్చర్యాన్ని కల్గించింది.

అరుంధతి సంభాషణను త్వరగా ముగించి భర్తకు గుడ్‌నైట్, స్వీట్ డ్రీమ్స్ చెప్పేసి టెలిఫోను వుంచేసి త్వరగా వినోద్ వద్దకు వచ్చింది.

''అదేమిటి వినోద్ ఎక్కడకు పోతున్నావు?''

''అరుంధతీ! పొరబాటు జరిగిపోయింది. త్రాగుడు మైకంలో నా లావణ్యే మీరనుకొని ఆవిధంగా ప్రవర్తించేను నన్ను క్షమించండి.''

అరుంధతి నివ్వెరబోయింది. తిట్టుకుంది మనస్సులో వినోద్ ప్రవర్తన ఆమెకు అర్థంకాలేదు

''వినోద్! మళ్ళీ ఈ అండీ గిండీ ఎందుకు మనిద్దరి మధ్యన. ఇప్పటినుండి మనిద్దరం నువ్వూ నేనే. పొరబాటులేదు, గ్రహపాటులేదు. అసలు ఈ సంబంధాన్ని నువ్వు నేటినుండి అలవాటు చేసుకోవాలి. నీ లావణ్యను నేనే అనుకో, ఇవాళనుండి,'' అని వినోద్‌ని కౌగలించుకుంది.

''ఛీ! ఛీ! నన్ను వదలండి- నేనలాంటివాణ్ణి కాదు. ఇప్పుడే మీ భర్తకు గుడ్‌నైట్, స్వీట్ డ్రీమ్స్ చెప్పి ఇదేమిటి నాతో ఇలా ప్రవర్తిస్తున్నారు ?''

''ఇంతసేపూ నా కౌగిలిలో తన్మయత్వం చెంది, నా ముఖమంతా ముద్దులాడిన నువ్వు ఇదేమిటి ఇలా ప్రవర్తిస్తున్నావు ప్రవరాఖ్యుడిలా ?''

''నేను చెప్పేనుకదా, అది త్రాగుడు విషయంలో చేసిన తప్పని.''

''ఆ తప్పే నాకెంతో మధురంగావుంది. బెట్టుచేయకు, మంచికాలాన్ని వృథాచేయకు వినోద్,'' అని మళ్ళీ గట్టిగా కౌగలించుకుంది.

వినోద్ ఎలాగో ఆమె చేతుల్ని విడిపించి, ఆమెను మంచంమీదకు త్రోసేసి తూలుకుంటూ

...టి గదిలోంచి బయటపడ్డాడు. అరుంధతి భర్తను, ఆ టెలీఫోనుని అమితంగా తిట్టుకుంది. వినోద్ పైన అరుంధతికి మిక్కిలి కోపంవచ్చింది — ''యూ స్కౌండ్రల్ – నీ అంతు చూస్తానుండు,'' అని తిడుతుంటే వినోద్ మెల్లగా మెట్లు దిగి హాలులోకి వచ్చి, మెల్లగా బయట పోర్టికోలోకి చేరి కారులో కూలబడ్డాడు. కాని కారును నడిపే స్థితిలో లేడు. చేతులు, కాళ్ళు చూపు అతని అధీనంలోలేవు. మళ్ళీ కారు దిగి తప్పటడుగులు వేసుకుంటూ గేటవతలకు వచ్చి అలా పోతున్న ఓ టాక్సీని పిలచి తనింటి యడ్రసు చెప్పి పోనివ్వమని టాక్సీలో కూర్చున్నాడు.

ఇంటికి చేరింతరువాత తూలుకుంటూ మేడమీద తన గదిలోకి పోయి మంచంమీద వ్రాలేడు. అది చూచి పోలయ్య గాభరాపడ్తూ గదిలోకి వచ్చేడు.

''పోలయ్యా — వెళ్ళి అవుట్‌హవుస్‌లో వున్న డ్రయివర్ను పిల్చుకురా,'' అని వినోద్ పోలయ్యను పంపాడు కాస్సేపటికి డ్రయివరు శామ్యూల్ రాగానే కారు తాళాలగుత్తి అతడి కిచ్చి, కారును ఎక్కడ తను వదలివచ్చింది చెప్పి, త్వరగా టాక్సీలో ఆ ఇంటికి పోయి ఆ కారును తీసుకురమ్మని చెప్పేడు.

పోలయ్య సహాయంతో మెల్లగా డ్రెస్సు మార్చుకుని ఏమీ తినకుండా ఓ గ్లాసు ఆరెంజిరసం మాత్రం త్రాగి పడుకుండిపోయేడు వినోద్

# జీవిత మాధుర్యం

మరునాటి ప్రొద్దున్న తొమ్మిది గంటలకు అశోక్ వచ్చేడు వినోద్ ఇంటికి. అశోక్ ముఖం చాలా గంభీరంగా వుంది అతని చూపు కాస్త తీవ్రంగా వుంది. వినోద్ విషయాన్ని కాస్త గ్రహించేడు

వినోద్ గదిలో వినోద్‌కి ఎదురుగా మరో కుర్చీలో కూర్చున్నాడు మరే ఉపోద్ఘాతం లేకుండానే అసలు విషయాన్ని ఎత్తుకున్నాడు

''వినోద్ నీ బుద్ధి ఇంతకి వక్రిస్తుందని నేను కలలోకూడా అనుకోలేదు.''

''ఏమిటి అశోక్ ఏం జరిగింది ?''

''వన్నా అడుగుతున్నావు! ఆ మాటను నేను నిన్ను అడగాలి. లావణ్యను మనసార ప్రేమిస్తున్నావని, ఈ విశాల ప్రపంచంలో నీకు కావల్సిన స్త్రీ ఆమే అని నాదగ్గర లెక్చరు దంచిన నువ్వు రాత్రి అంత ఉద్రేకంగా అరుంధతిని ముద్దులాడుతున్నావే దాని అర్థమేమిటి?'' అని నిలదీసి అడిగేడు.

వినోద్‌కి ముచ్చెమటలుపోసేయి చాలా సిగ్గుపడిపోయేడు.

''నీకెలా తెల్సు ?''

''నేను నా కండ్లతో చూసేను గనుక.''

''అసలు నేను అరుంధతి ఇంటికి వెళ్ళినట్లు ...లా తెల్సింది ?''

''పిల్లి కళ్ళు మూసుకుని పాలు త్రాగుతూ లోకమంతా కళ్ళు మూసుకుంది అనుకుందట, అలాగుంది నీ సంగతి. అరుణ, నేను చెప్పినా వినక, అరుంధతి నువ్వు క్లబ్బు నుండి మాయమవగానే ఆరాతీసింది. చెట్ల క్రింద నీ కారు లేదు. అరుణ గేటుమన్‌ని అడుగుతే నువ్వు అరుంధతి నీ కారులో దయచేసేరని చెప్పేడు. వెంటనే అరుంధతి యింటికి తనని తీసుకొనివెళ్ళమని అరుణ నన్ను వత్తిడిచేసింది – లేకుంటే టాక్సీలో తనొక్కర్తి పోతానంది. చేసేదేమీలేక నేను అరుణను తీసుకుని అరుంధతి ఇంటికి వచ్చేను. పోర్టికోలో నీ కారు వుంది అరుణ నేను మేడమీదకు వచ్చి, గది ద్వారం కర్టను తొలగించి చూద్దుముకదా నీ మన్మథలీలలు గోచరించేయి. నువ్వేమో ఒంటిమీద తెలివిలేకుండా అరుంధతిని ఆవేశంగా ముద్దులాడేస్తున్నావు. అరుణ కోపంతో వణకిపోయింది అరుంధతి ఇంట్లో ఆ పనివాళ్ళందరిముందు ఏం గొడవ చేస్తుందోనని, నీ పరువు, అరుంధతి పరువు వీధిపాలు చేస్తుందోనని భయపడి, అరుణను మెల్లగా బయటకు తీసుకునివచ్చి కారు ఎక్కించి ఆమె ఇంట్లో వదలిపెట్టేను ఇప్పుడు చెప్పు - నువ్వలా నీచంగా ఎందుకు ప్రవర్తించేవు ?''

''మైగాడ్! – అరుణ కూడా చూసిందా!''

వినోద్ తల పట్టుకుని కాస్సేపు అలా కూర్చుండిపోయేడు వ్యధతో. కొంతసేపటికి మెల్లగా తలెత్తి – ''అశోక్! నేను నిజం చెప్తే నమ్ముతావా?'' అని గంభీరంగా అశోక్‌ని ప్రశ్నించేడు.

''నమ్ముతాను చెప్పు.''

''నిన్నను ప్రొద్దున్న నందనమామయ్య ఏగా ఇంటికి వచ్చి నాతో అరుణ పెండ్లి విషయం ప్రస్తావనకు తెచ్చేడు నేను అరుణను వివాహం చేసుకోనంటే నన్ను నానామాటలని మన కంపెనీని రెండు ముక్కలు చేస్తానని, నా పతనం చూస్తానని శపథంచేసి వెళ్ళిపోయేడు నా మనస్సు వ్యాకులమై క్లబ్బులో నిన్న సాయంత్రం కాస్త ఎక్కువగానే విస్కీ పుచ్చుకున్నాను దాని ఫలితం బాగా నిషా చేసింది. ఆ సమయంలో అరుంధతి తన కారును తన భర్త లోకనాథం విజయవాడకు తీసుకుని వెళ్ళేడని, తనని తనింటివద్దకు నా కారులో దిగబెట్టమని కోరింది కాదనలేక ఆమెను నా కారులో ఆమె ఇంటికి తీసుకునివెళ్ళేను. అసరికి నాకు బాగా మత్తు కక్కింది. నేను తూగుతున్న స్థితిలో కాస్త రెస్టు తీసుకోమని చెప్పి అరుంధతి నన్ను తన గదిలోకి తీసుకునివెళ్ళింది.

విషాలో నేనుండగా ఆమె వివస్త్ర అయి పలుచని గౌనులో నాముందర నించుని ప్రేమగా వినోద్ అని పిలచి చేతులు చాచగానే, నా మత్తు మెదడుకు నా లావణ్య ఎదురుగా వచ్చి నిల్చున్నట్లయింది. లావణ్యా వచ్చేవా అని నా కౌగిలిలోకి తీసుకుని ఆమెను ముద్దులాడుతుంటే మీరు వచ్చి చూసుంటారు. ఆ తరువాత ఆ గదిలో టెలిఫోను మ్రోగింది. మేము వెంటనే విడిపోయేం

[ 32వ పేజీ చూడండి ]



'శాంతి'లో ఒక దృశ్యం.

# జి. ఏ. జి. పేజీ

## "దొంగలకు సవాల్"లో పెట్టెల తారుమారు

"ఏ" కంపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశించబోయిన రాజా (కృష్ణ), అక్కడ అమ్మాయిల నవ్వులు గోలగా వినిపించి విస్తుపోయాడు. ఒకవేళ తను పొరబడ్డానేమోనన్న అనుమానంతో ఒక్క అడుగు వెనక్కువేసి, కంపార్ట్‌మెంట్ పైకి చూశాడు. రేఖ (జయప్రద), ఆమె స్నేహితురాళ్ళు వాళ్ళ ధోరణిలో వాళ్ళు మళ్ళీ గొల్లున నవ్వారు.

"ఎక్స్‌క్యూస్‌మీ... మీరంతా 'ఈ కంపార్ట్‌మెంట్‌లోనే ప్రయాణం చేస్తున్నారా?" రాజా అడిగాడు. అందరూ వింత జంతువును చూసినట్టు రాజుకేసి తిరిగారు. "చూడండి ఆ బెర్త్ నాది," అన్నాడు రాజా.

"అలాగా?" అంటూ ఒక అమ్మాయి "తీసుకెళ్ళండి స్వామీ తప్పకుండా తీసుకెళ్ళండి," అంది.

"నా బెర్త్ ఖాళీ చేస్తారా లేదా?"

రేఖ చిలిపిగా చూస్తూ, "మిస్టర్! పగలు మూడోవంతు, రాత్రి మొత్తం వంతు. దాని పేరే బర్త్," అంది. ఇంతలో గార్డ్ విజిల్ వేశాడు.

"అమ్మో, గార్డేశ్వరరావుగారు విజిలేస్తున్నారే! పదండి," అంటూ స్నేహితురాళ్ళంతా రేఖకు 'టా–టా' చెప్పి దిగిపోయారు.

ఇంతలో ఒకతను బాండ్ బాక్స్ తీసుకొని ఆ కంపార్ట్‌మెంట్‌లోకి వచ్చాడు. ఆ బాక్స్‌ను క్రిందపెట్టి కూర్చున్న వాడల్లా కారిడార్‌లో ఇన్‌స్పెక్టర్‌ను, కానిస్టేబుల్స్‌ను చూసి, కంగారుగా కంపార్ట్‌మెంట్‌లోంచి దిగిపోయాడు. ట్రెయిన్ కదలగానే ఎస్.ఐ., పోలీసులు ఇటు అటు గబగబ చూసుకుంటూ వెళ్ళి, దిగిపోయారు.

బెడ్డింగ్ సర్దుకుంటూన్న రాజా అడ్డుగా ఉన్న బాండ్ బాక్స్‌ను తీసి, ఎదురుగా ఉన్న బర్త్ కిందికి తోయడం పత్రికను ముఖానికి అడ్డుగా ఉంచుకున్న రేఖ క్రీగంట గమనించింది. ఇంతలో ట్రెయిన్ వేగం అందుకుంది.

షూట్ ఓ–కే అయ్యాక "పెట్టెల తారుమారుతో చాలా తమాషా జరుగుతుంది," అని తెలియజేశారు డైరెక్టర్ కె. ఎస్. ఆర్. దాస్.

త్రిమూర్తి కంబైన్స్ తాజా వర్ణ చిత్రానికి మొదట "మొనగాడొచ్చాడు" అనే పేరు పెట్టా లనుకున్నారు. అదికాక ఇప్పుడు "దొంగలకు సవాల్" అనే పేరును స్థిరపరచినట్లు తెలియజేశారు నిర్మాతలు పి. బాబ్జి, ఉప్పలపాటి సూర్యనారాయణబాబు. కృష్ణ, జయప్రదతోపాటు నాగభూషణం, సత్యనారాయణ, మోహన్‌బాబు, పద్మనాభం, రాజనాల, రావి కొండలరావు, త్యాగరాజు, అల్లు రామలింగయ్య, జయమోహన్, పండరీబాయి, మోహిని, జయమాలిని పాత్రధారులు. భమిడిపాటి రాధాకృష్ణ రచయిత. ఆత్రేయ, ఆరుద్ర, కొసరాజు గీతాలకు సత్యం బాణీలు కూర్చారు. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు.

## శారద నటిస్తూన్న హిందీ చిత్రం

"దర్శక నిర్మాత నసీర్ హుసేన్ ప్రారంభించిన 'జబర్దస్త్' అనే హిందీ చిత్రంలో పాల్గొనడానికి ఈమధ్య బొంబాయికి వెళ్ళొచ్చాము," అన్నారు శారద ఇటీవల వాహినీ స్టూడియోలో "కార్తీకదీపం" సెట్‌లో కనిపించినప్పుడు. ఆ హిందీ చిత్రంలో దిలీప్‌కుమార్ సరసన ఆమె నటిస్తోంది. లోగడ పెక్కు హిట్ చిత్రాలు సమర్పించిన నసీర్ హుసేన్ ఆ క్లిష్టమైన పాత్రకు శారద మాత్రమే న్యాయం చేకూర్చగలదని సూచించినప్పుడు దిలీప్ "కరెక్ట్! వెంటనే వెళ్ళి ఆమెను బుక్ చేయండి. ఆమెను 'సమాజ్‌కో బదల్ డాలో' (మనుషులు మారాలి – హిందీ) చిత్రంలో చూశాను. అత్యద్భుతంగా నటించింది," అన్నాడట. తన సరసన నటించే నటిని దిలీప్ అంత తేలికగా ఆమోదించడం అరుదు. నసీర్ యెకాయెకీన మద్రాసుకు ఎగిరివచ్చి, "కార్తీకదీపం" సెట్‌లోనే శారదను కలుసుకొని ఆ విషయం చెప్పాడట. అప్పుడు సెట్‌లో ఉన్న శోభన్‌బాబు, డైరెక్టర్ దీపక్, ప్రభాకరరెడ్డి తదితరులందరూ ఆమెను అభినందించారు. సినిమా స్కోప్ (స్టీరియోఫోనిక్ సౌండ్)లో తయారౌతూన్న 'జబర్దస్త్' మల్టీ స్టారర్ చిత్రంలో ధర్మేంద్ర – జీనత్ అమన్ ఒక జంట. రుషికపూర్ – టీనా మునీమ్ ఇంకో జంట. ఇంకా – ఆశాపరేఖ్, అమ్జాద్‌ఖాన్, రాజ్‌కిరణ్, కాజల్‌కిరణ్ ప్రభృతులెందరో నటిస్తున్నారు. లోగడ శారద నటించిన 'సమాజ్‌కో బదల్ డాలో'లో పరీక్షిత్ సాహ్ని, 'అగ్నిరేఖ'లో సంజీవ్ కుమార్, 'అపరాజిత్'లో అమితాబ్ బచ్చన్ హీరోలు. ఇప్పుడామె నటిస్తూన్న తెలుగు చిత్రాలు 'కార్తీకదీపం, నిమజ్జనం, ప్రియబాంధవి, మా ఇంటి జ్యోతి'. గిరిబాబు త్వరలో ప్రారంభించే చిత్రంలో ఆమే నాయిక.

'నాయిల్లు నావాళ్ళు'లో శ్రీధర్, మురళీమోహన్





అన్నిటికన్న ఎత్తుగా ఎగిరే తెల్లదనం
ఒక్క రాబిన్ బ్లూతోనే

అన్నిటినీ మించిన నీలం
రాబిన్ బ్లూ.
నూలు బట్టలకోసం.
నికార్సయిన, ఎంతో సరిసమానమైన తెల్లదనం కోసం.
ఉతుకు ఉతుకుకీ మరింతగా.

రాబిన్ బ్లూ—
నూలుబట్టలకు తెల్లదనాన్నివ్వడంలో దీన్ని మించినది లేదు.

# ROBIN

Robin Ultramarine

STANDARD QUALITY

Regd.

MADE IN INDIA

RECKITT & COLMAN OF INDIA LTD.

41, Chowringhee Road, Calcutta-700071

# జి. వి. జి. పేజీ



'నిమజ్జనం'లో శారద.

## "రంగూన్ రౌడీ" చిత్రంలో దాగిని నిజం

డైరెక్టర్ దాసరి నారాయణరావు "ఆక్షన్!" అనేసరికి జానకి "చెప్పను. చెప్పను", అన్న క్లోజ్ డైలాగ్ అందించడంతో, ఇందు (జయప్రద) "ఎందుకు చెప్పరు? అంటే, అన్యాయం మీకు జరగలేదన్నమాట? మీరే అన్యాయం చేశారన్న మాట?" అంది.

"లేదు. నాకే అన్యాయం జరిగింది... మీకు ఆవేశం ఉందిగాని, అనుభవం లేదమ్మా. నా అనుభవం ఆవేశాన్ని చంపేసింది. గుండెల్లో మండే మంట మండి ఒక గుండెనే కాలుస్తుంది. కాని, అది బయటకు వస్తే, దానికి గాలి తోడైతే— ఎన్నో గుండెల్ని మండిస్తుంది... రాజు గురించి నువ్వు విన్నావు. కాని, నేను కన్నాను. రాజు నీకు తెలుసు. నేను పెంచాను. రాజు గురించి నీకన్నా నాకు ఎక్కువ తెలుసమ్మా. అన్యాయాన్ని, అవమానాన్ని భరించలేడు. క్షణంలో ఇటో అటో తేలిపోవాలి వాడికి. నిజం తెలిస్తే—"

"తెలియాలి. తెలియనంత కాలం ఎవరెవరో. మీరు చెప్పనందుకే జైలు నుంచి పారిపోయి వచ్చాడు. ఇక్కడ చెప్పనందుకే నాదగ్గరకొచ్చాడు. ఇప్పుడుకూడా తెలియకపోతే — తెలుసుకునేవరకూ నిద్రపోడు. ఈ ప్రయత్నంలో ఎన్ని ప్రాణాలు పోతాయో ఆలోచించండి. అబద్ధం చెప్పడం ఎంత ప్రమాదమో — కొన్ని సమయాల్లో నిజాన్ని దాచడం అంతకన్నా ప్రమాదం. చెప్పండి. చెప్పండి," అంది ఇందు. ఎలా చెప్పడమా అని జానకి తటపటాయిస్తుండగా ఆ షాట్ అంతమౌతుంది.

వడ్డె శోభనాద్రి నిర్మించే విజయమాధవీ పిక్చర్స్ "రంగూన్ రౌడీ" సినిమాస్కోప్ వర్ణ చిత్రంలో కృష్ణంరాజు హీరో. జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు. కె. ఎస్. మణి ఛాయాగ్రాహకుడు. నిర్వహణ : వడ్డే రమేష్.

'దొంగలకు సవాల్'లో కృష్ణ, జయప్రద.



## సినిమాలలో లాభికంగా

సినిమాలలో నటించాలనే ఉబలాటంకొద్దీ సంపన్నులైన కొందరు కొన్ని చిత్రాల్లో వేషాలు సంపాదించి, ఆ వృత్తిమీద బ్రతికేవారి కడుపులు కొట్టడం గురించి యిటీవల చిత్రవిచిత్రంగా చెప్పుకుంటున్నారు. కొందరు ఎదురు డబ్బిచ్చి నటిస్తున్నారటకూడా. బొంబాయిలో అయితే మరీనూ ... అక్కడ ప్రసిద్ధిపొందిన నానావతి హాస్పిటల్ అధినేత మనవడు డాక్టర్ పరేష్ నానావతి అనే యువకుడు సినిమా ఛాన్సులకోసం తల్లడిల్లిపోతున్నాడు. "దవేద్వర్" అనే చిత్రంలో విలన్ పాత్ర ఇస్తేమన్నా సరేనని ఒప్పుకున్నాడు. అమిత్‌ఖన్నా అనే కవి ఉచితంగా 22 హిందీ చిత్రాలకు పాటలు రాస్తున్నాడు. "నాకిది ప్రొఫెషన్ కాకపోయినా, ఫేషన్," అంటాడటతను.

## భువనేశ్వరి

"గోపీ, నాగరాజు—ఇద్దరూ తెగిన గాలిపటాలు. వ్యాపార భాగస్తులు. అంతకంటే యెక్కువ ప్రాణస్నేహితులు. కాని, ఒకరు నిప్పు, మరొకరు ఉప్పు. తల్లీ — చెల్లీ, మల్లీ — ఉల్లీల మధ్య వున్న బంధంకాని, సంబంధంకానీ తెలియనివాడొకడైతే, 'ఒకే మాట—ఒకే వనిత నాది' అంటూ బ్రతికేవాడు మరొకడు. వీరిద్దరి మధ్యకు, ఈ విరుద్ధ ప్రకృతుల మధ్యకు విధిచేత విసిరివేయబడ్డ మరో జీవి భువనేశ్వరి," అని విశదీకరించారు డైరెక్టర్ ఎం. మల్లికార్జునరావు. జయ ఆర్ట్స్ బానర్‌లో కందిమళ్ళ నారాయణమూర్తి నిర్మించిన



"భువనేశ్వరి" చిత్రంలో చంద్రమోహన్, నరసింహరాజు, మాధవి, సుమిత్ర, అల్లు రామలింగయ్య, జయమాలిని, నిర్మల, సి. ఆర్. మోహన్, శివరామిరెడ్డి, బ్రహ్మం, మాస్టర్ విజయ్ పాల్గొన్నారు. సత్యానంద్ సంభాషణలకర్త. ఆత్రేయ, సి. నారాయణరెడ్డి గీతాలకు సత్యం బాణీలు కూర్చారు. లక్ష్మణ్ గోరే ఛాయాగ్రాహకుడు. పి. ఎస్. రెడ్డి సహదర్శకుడు. కూర్పు : కోటగిరి గోపాలరావు. ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : పి. వి. రమణమూర్తి.

'ముద్దులకొడుకు'లో శ్రీదేవి, అక్కినేని.



# సినిమా

## అగ్రశ్రేణి నాయకుని ముందంజ

తెలుగు చలనచిత్ర పరిశ్రమను అయిదుగురు పాలిస్తున్న నిజం పాఠకులకు తెలుసు. వారిలో శ్రీ శోభన్‌బాబు ఒకరు.

నటనలో తనకొక ప్రత్యేకమైన ఒరవడిని ప్రవేశపెట్టి... ఆంధ్ర ప్రేక్షకుల గుండెలలో శాశ్వతమైన స్థానాన్ని ఆర్జించుకున్నారు శ్రీ శోభన్.

అందగాడు మరియు నవరస పాత్ర పోషణలో గట్టివాడు అని ఆయన నటించిన ఎన్నో చిత్రాలు నిరూపించాయి.

సినిమా రాజకీయాలకు తలవొగ్గక... తను నమ్మిన సిద్ధాంతాన్ని ఆచరణలో పెడుతూ, శోభన్‌బాబు "య్యాజ్ ఏ మాన్ ఆఫ్ పర్‌ఫెక్షన్" అని పేరు తెచ్చుకున్నారు.

రాత్రింబవళ్లవలె ప్రతి మనిషి జీవితంలో వెలుగునీడలు వస్తూవుంటాయి. అనవసరంగా కొన్నాళ్ళు... శ్రీ శోభన్‌బాబు సినిమా జీవితంలో "చీకటి"ని చవిచూడవలసివచ్చింది. మరొకరయితే... ఆ రోజులలో విసుగు విరక్తితో గడిపేవారు. కానీ, మనోనిబ్బరం... ఆత్మవిశ్వాసం, ఆశావాదం వున్న వ్యక్తి గనుక.. శ్రీ శోభన్ అప్పుడు కూడా యాక్టివ్‌గా, హ్యాపీగా గడిపేవారు.

శ్రీ శోభన్‌బాబుకు 1978లో శుభయోగం ప్రారంభమై... రెండు విజయాలను ఆర్జించి పెట్టిన విషయం ప్రేక్షకులకు తెలుసు. (మల్లెపూవు ... రాధాకృష్ణ)

ఈ సంవత్సరం నుంచి, మరో అయిదేండ్లు శ్రీ శోభన్ రాజయోగ జాతకఫలాన్ని పొందగలడని... ఈ కలం నమ్ముతూంది.

'ఛాయ'లో రూప, సత్యేంద్రకుమార్.

రాబోయే శోభన్‌బాబుగారి చిత్రాలన్నీ... నటుడుగా ఆయనకు పేరు ... ప్రతిష్ఠలను తెచ్చేవిగా వున్నాయి. వెరైటీ చిత్రాల హీరోగా, తనకు ప్రజలు యిచ్చిన యిమేజ్‌కు అనుగుణంగా వుండే పాత్రలను శ్రీ శోభన్ ఎంపిక చేసుకుంటున్నారు.

"కార్తీకదీపం", "జూదగాడు", "చండీప్రియ", "యువచిత్ర", "రాజా, ఆర్ట్స్", "మండే గుండెలు", "కుమారస్వామి ఫిలింస్", "శిరిపురంలో ఓ సిన్నోడు". చిత్రాలలో శ్రీ శోభన్‌బాబు వైవిధ్యం వున్న పాత్రలను పోషిస్తున్నారు. అన్ని పాత్రలలో "వెరైటీ బాబు" కనిపిస్తారు.

కొందరివలె శ్రీ శోభన్ పేపర్లో పేరుపడే దానధర్మాలకు యిష్టపడరు. ఆయన అజ్ఞాతంగా ఎందరికో సహాయపడ్డారు. ఎందరికో విద్య కోసం ధన సహాయం చేశారు.

నమ్మిన మిత్రులను, ఆత్మీయులను శ్రీ శోభన్ ఎంతో గౌరవంగా ట్రీట్ చేస్తారు.

ఈ కలం ఆయనకు "హీ–మాన్" అని బిరుదునిస్తే... యువతీ యువకులు తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు.

శ్రీ శోభన్‌బాబును ప్రేమించే అభిమానులకు మూడు సుగుణాలు వున్నాయి. "సభ్యత...సఖ్యత... సౌమ్యత" 1979 జూన్ నుంచి శ్రీ శోభన్‌కు రాజయోగం... ప్రారంభమౌతుందని ఈ కలం నమ్మకం. "ఫ్యూచర్ హోప్"గా పేర్కొనబడిన శ్రీ శోభన్‌బాబును "యస్సెట్ ఆఫ్ ది యిండస్ట్రీ"గా యీ కలం పేర్కొంటుంది.

## ఎన్ టి ఆర్‌తో జయప్రద

సూపర్‌స్టార్ శ్రీ ఎన్. టి. రామారావుతో గ్లామర్ తార జయప్రద నటించిన చిత్రాలన్నీ ఘనవిజయాన్ని సాధించిన విషయం పాఠకవిదితం. ఈమధ్య కొంతకాలం శ్రీ రామారావు కాంబినేషన్‌లో కుమారి జయప్రదను మనం చూడలేకపోయాం. ఆ ఇద్దరి జంటను ఎదురుచూచే ప్రేక్షకులకొక శుభవార్త. ప్రముఖ వ్యాపారవేత్త శ్రీ ఆర్. గోపాల్ లక్ష్మి విష్ణు ప్రొడక్షన్స్ బ్యానరుపై భారీయెత్తున నిర్మిస్తున్న "సూపర్‌మ్యాన్" చిత్రంలో శ్రీ రామారావు సరసన జయప్రద నటిస్తూంది. సెప్టెంబర్ నుంచి సెట్స్‌పైకి వెళ్లే ఈ వర్ణ చిత్రానికి శ్రీ విక్టరీ మధుసూదనరావు దర్శకత్వం వహిస్తున్నారు. శ్రీ ఆర్. కె. ధర్మరాజ వ్రాసిన "సూపర్‌మ్యాన్" కథకు శ్రీ ఆత్రేయ సంభాషణలను, శ్రీ చక్రవర్తి స్వరాలను, శ్రీ మార్కస్‌బార్ట్లే ఛాయాగ్రహణాన్ని సమకూరుస్తున్నట్టు శ్రీ గోపాల్ చెప్పారు.

## బాలు నిర్ణయం

బాలు ఈజ్ ఎ బిజీ హీరో నౌ. ఏ రికార్డింగ్ థియేటరు కెళ్లినా బాలు దర్శనం తప్పదు. రోజుకు మినిమమ్ అయిదు పాటలు పాడే ఏకైక గాయకుడు బాలు అంటే అత్యుక్తి కాదు. ఆమధ్య ఒకరోజు బాలును కల్సినపుడు "కంగ్రాట్స్. మూడు తెలుగు చిత్రాలకు సంగీత దర్శకత్వం వహిస్తున్నారట. "కెప్టెన్ కృష్ణ"కు మీరు కూర్చిన బాణీలు, "తూర్పు వెళ్లే రైలు"కు మీరిచ్చిన ట్యూన్స్ విన్నాను. రియల్లీ మెలోడియస్. మెగా ఫార్చూన్ ది సేమ్" అన్నాను. "థాంక్యూ" అంటూ పాట పాడడానికి రికార్డింగ్ థియేటర్లోకి వెళ్లారు బాలు. పాటపాడి వచ్చాక ఓ ప్రశ్నవేశాను. "ఇమిత చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించరా" అని. "ఆఫర్లు వచ్చాయి. కానీ చెయ్యదలచుకోలేదు. ఆ వాతావరణం నాకు నచ్చలేదు" అన్నారు బాలసుబ్రమణ్యం. ఎ గుడ్ డెసిషన్ ఇన్‌డీడ్.

'ఒక చల్లని రాత్రి'లో మాధవి, చంద్రమోహన్

# సి ని మా



'నరుడా ఏమి నీకోరిక'లో
పి. యల్. నారాయణ, రావుగోపాలరావు.

## "మే" నుంచి జయలక్ష్మి గుడ్ బై

సినిమా ఫీల్డ్‌లో సంవత్సరాలతరబడి వున్నా, ఇంకా, ఇంకా ఆ ఫీల్డ్‌లో పాతుకుపోవాలని కుతూహలపడేవాళ్ళు ఎక్కువగా కన్పించే ఈరోజుల్లో, నటించింది చాలు, ఇక విశ్రాంతే మేలు అని భావించే తారలు ఎంతమంది వుంటారు. ఏ కొద్దిమందో! అలాంటివారిలో ఫటాఫట్ జయలక్ష్మి ఒకరై. " 'మే' నుంచి చిత్రాల్లో నటించదలచుకోలేదు. గతంలో అంగీకరించిన చిత్రాలు 'మే' లోపు పూర్తిచెయ్యదలచాను. కొత్త చిత్రాలు బోలెడన్ని వచ్చాయి. కానీ ఏదీ ఒప్పుకోలేదు" అంది ఫటాఫట్ జయలక్ష్మి.

ఏదిఏమైనప్పటికీ జయలక్ష్మి ఈ నిర్ణయం బాగోలేదు. మాంచి స్వింగ్‌లో వున్నప్పుడు ఇలాంటి సడెన్ డెసిషన్ తీసుకోవడం సబబుగాలేదు. మరోసారి ఆలోచించమ్మాయి అంటూ ఆమె ఆత్మీయులు, శ్రేయోభిలాషులు చెప్పిచూడా చూశారు. కానీ జయలక్ష్మి నిర్ణయం మారలేదు. వర్క్ వున్న ఇలాంటి ఆర్టిస్టులంతా గుడ్‌బై కొట్టడం ఆలోచించాల్సిన విషయమే.

## మోహన్‌బాబు జీపులో సిగార్‌లైటర్, సిగరెట్ కేస్

కార్లోనో, జీపులోనో సిగార్‌లైటర్, సిగరెట్‌కేస్ వుండడంలో ఆశ్చర్యం ఏముంది? అని మీరడగొచ్చు. కానీ నే చెప్పే విషయంలో వింత వుంది. ఆమధ్య మోహన్‌బాబు ఇంటికెళితే ఓ జీపును చూపించి, అందులో రహస్యంగావున్న సిగరెట్‌కేస్, సిగార్‌లైటర్‌ను వెలికితీశారు. ఏమిటండీ ఇది అని అడిగాను. ఇదొక వింత జీపు. జీపు రన్ అవుతుంటే సిగరెట్‌కేస్ వస్తుంది. సిగరెట్ తీయగానే సిగార్‌లైటర్ వెంటనే మండుతుంది అని ట్రయిల్ చూపించారు. "రంగూన్ రౌడీ" చిత్రంలో ఈ జీపును వాడాలని అనుకుంటున్నాను. డైరెక్టర్ శ్రీ దాసరి నారాయణరావుతో ఒక్కమాట చెప్పి ఆ తర్వాత ఆ పని చేయాలి అన్నారు. ఇదంతా చదివాక నేను వ్రాసిందాంట్లో వింత లేదనగలరా మీరు? తను ధరించే ప్రతి పాత్రలో ఏదో కొంత ప్రత్యేకతను చూపించాలనే తాపత్రయమే మోహన్‌బాబును ఇలాంటి ఖరీదైన, అరుదైన వస్తువులను కొనమంటుందేమో!

కె.బాలచందర్

ప్రేమాలయ సమర్పించు

# అందమైన అనుభవం

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: ఆర్. వెంకట్రామన్

మాటలు: గణేష్‌పాత్రో పాటలు: ఆచార్య ఆత్రేయ సంగీతం: ఎం.ఎస్.విశ్వనాథం

కెమెరా: బి. యస్. లోకనాథ్

నెగటివ్ రైట్స్: రవీంద్ర ఫిలింస్ రావుల అంకయ్యగౌడ్ (గూడూరు)

లక్ష్మీ ఫిలింస్

## ఇది విన్నారా?

★ శ్రీ ఎన్. టి. ఆర్. కథానాయకుడిగా శ్రీ కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో రోజా మూవీస్ నిర్మిస్తున్న వర్ణ చిత్రం మొదటి షెడ్యూల్ పూర్తయింది. ఏప్రిల్ ఒకటి నుంచి 24 వరకు ఊటీ, మదుమలై అడవుల్లో జరిగే షూటింగ్‌తో చిత్రం పూర్తవుతుంది శ్రీ యం. అర్జునరాజు, శ్రీ కె. శివరామరాజు నిర్మిస్తున్న ఈ చిత్రానికి శ్రీ కుమార్జీ నిర్వహణ. ఈ చిత్రంలో కుమారి శ్రీదేవి శ్రీ ఎన్. టి. ఆర్. సరసన నటించడం విశేషం.

★ అందరిచేత మంచివాడు అనిపించు కున్నవాడు, అందరికీ కావలసినవాడు శ్రీ హరికృష్ణ గత సంవత్సరం నైజాంలో శ్రీ లక్ష్మి చిత్ర అనే పంపిణీ సంస్థను స్థాపించి చక్కటి పేరు గడించారు. ఈ సంవత్సరం విజయవాడలో ఉగాది పర్వదినాన "లక్ష్మి చిత్ర" అనే మరొక అనుబంధ పంపిణీ సంస్థను స్థాపించి, ఆ సంస్థను ప్రముఖ వ్యాపారవేత్తలు రాజ్యసభ సభ్యులు అయిన శ్రీ కె. యల్. యన్. ప్రసాద్‌చే ప్రారంభించి, ఆనాటి ఆనందోత్సవానికి విజయ, వాహినీ స్టుడియోల అధినేత, ప్రముఖ నిర్మాత శ్రీ బి. నాగిరెడ్డిని ముఖ్య అతిథిగా ఆహ్వానించి, నవతకు నాంది పలికిన శ్రీ హరికృష్ణ అభినందనీయులు.

★ శ్రీ పద్మావతి ఇంటర్నేషనల్ పతాకం క్రింద శ్రీ యు. సూర్యనారాయణబాబు సమర్పిస్తున్న చిత్రానికి "నా ఇల్లు - నావాళ్ళు" అని పేరు పెట్టారు. ఫిబ్రవరి 28న ప్రారంభమైన ఈ చిత్రం ఏప్రిల్ మొదటి వారాని పూర్తయింది. శ్రీ రాజాచంద్ర దర్శకత్వ వహిస్తున్న ఈ చిత్రంలో శ్రీధర్, మురళీమోహన్ గుమ్మడి, గిరిబాబు, నూతన్‌ప్రసాద్, త్యాగరాజ రాళ్ళపల్లి, సుభాషిణి, సావిత్రి, కె. విజయ భావన, రమాప్రభ, నిర్మల ముఖ్య తారాగణం డాక్టర్ టి. కె. యం. చటర్జీ ఈ చిత్రాని నిర్మాత.



'నగ్నసత్యం'లో కృష్ణవేణి, రామ్‌ప్రసాద్.

★ కుమారి జయసుధ మార్చి 29 వ తే అంటే ఉగాదినాడు నూతన గృహప్రవేశం చేసింది నెం. 9, గిరిరోడ్‌లోని నూతన గృహంలో కుటుంబ సమేతంగా ప్రవేశించింది కుమా జయసుధ.

★ జర్నలిజంలో కూడా కొంత అనుభవ వుందట శ్రీ రజనీకాంత్‌కు. బెంగుళూరులో "కర్నాటక సంయుక్త" అనే జర్నల్‌లో కొన్ని రోజులు ప్రూఫ్‌రీడర్‌గా పనిచేసారట.

★ నటీమణులలో డాక్టర్లను పెండ్లి చేసుకున్న తారలు ముగ్గురే. ఆ ముగ్గురు ఎవర వైజయంతిమాల, పద్మిని, వాణిశ్రీ.

— శ్రీనివాస్ ★

# దివ్యమైన తెలుపుకు ఒకే దారి

క్రొత్త ఫార్ములా

# డెట్

డిటర్జెంట్ ఉతికే పౌడర్




సాటిలేని ఉతుకు శక్తి,
అదనపు నురుగు,
తాజా సువాసన మరియు
దివ్యమైన తెలుపు!

దివ్యమైన తెలుపు,
డెట్ యొక్క తెలుపు

Shilpi-DM-52/78

# జీవిత మాధుర్యం

[ 22వ పేజీ తరువాయి ]

శోకవార్తం విజయవాడ నుండి ఆమెకి చేసిన ట్రంక్‌కాలది. నేను బాత్‌రూంలోకి వెళ్ళి ముఖం, తల కడుక్కుని కొంత నిషా వదిలించుకుని వచ్చేక నేను చేసిన పొరబాటు నాకు తెల్సివచ్చింది. నా భ్రమ తొలగిపోయింది. ఎంతో బాధతో కృంగిపోయి, నన్ను వదలకుండా పట్టుకున్న అరుంధతిని మంచంమీదకు త్రోసేసి, కారును డ్రయివుచేసే స్థితిలో లేనుగనుక టాక్సీలో ఇంటికి వెంటనే వచ్చేసాను.

తమ్ముడూ నన్ను నమ్ము. దైవసాక్షిగా చెప్తున్నాను. ఇంతే జరిగింది. నేను లావణ్యను మనసార ప్రేమిస్తున్నాను. నేను అరుంధతిని ఏనాడూ కాంక్షించలేదు. అరుణ నా గురించి అంత నీచంగా భావించడం నేను సహించలేను. అందుకే నువ్వు ఎలాగైనా ఇప్పుడు కాకపోయినా తరువాత ఎప్పుడైనా జరిగిన సంగతి చెప్పి నేనట్లాంటి కాముకుడను కానని నచ్చజెప్పాలి."

"అన్నయ్యా! నీ మాట పూర్తిగా నమ్ముతున్నాను. నిన్ను సందేహించినందుకు మరేమి అనుకోకు."

* * *

రెండురోజుల తరువాత నందనరావు కేశవరావు ఇంటికి వచ్చేడు. అసరికి అశోక్ ఇంట్లోనే వున్నాడు. వినోద్‌తో ఘర్షణ జరిగిననాటి నుండి నందనరావు కంపెనీ ఆఫీసుకు వెళ్ళడం మానుకున్నాడు

"ఏం బావా ఎన్నాళ్ళయిందో నువ్వు మా ఇంటికి వచ్చి. రా కూర్చో," అని కేశవరావు ఆప్యాయంగా నందనరావును ఆహ్వానించేడు. నందనరావు పినతల్లి కూతురు కేశవరావు భార్య కేశవరావు ఆరోగ్యం కొన్ని సంవత్సరాలై బాగులేక ఇంట్లోనే వుంటున్నాడు.

"ఏమిరావడం! నువ్వేమో హాయిగా ఇంట్లో వుండి విశ్రాంతి తీసుకుంటున్నావు నేనేమో ఆ కంపెనీలో అంత శ్రమపడుతున్నాను. కేశవరావు! నేను వినోద్ ఇండస్ట్రీస్ నుండి వేరైపోదామనుకుంటున్నాను"

"అదేమిటి బావా – నువ్వు లేకపోతే ఆ కంపెనీ వ్యవహారాన్ని చూసేదెవరు? వినోద్ ఒక్కడు చూసుకోగలడా?" అన్నాడు కేశవరావు

"చూడలేకపోతే గంగలోకి దూకమను. ఆ ఇండస్ట్రీస్ ఏమయితే నాకేం!"

కేశవరావు ఆశ్చర్యానికి అంతులేదు. వినోద్ ఇండస్ట్రీస్‌ని, వినోద్‌ని ప్రాణపదంగా చూసుకునే నందనరావేనా ఈవిధంగా మాట్లాడుతున్నది అన్న సంశయంలో పడ్డాడు. అశోక్ మామయ్య కోపం గ్రహించేడు గనుక తనలో తనే నవ్వుకున్నాడు.

"ఏమయింది బావా, నీ మేనల్లుడు వినోద్ మీదేనా నువ్వు కోపగిస్తున్నావు? నాకేమీ బోధపడడంలేదు నీ ధోరణి."

"ఆ విషయం మాట్లాడుదామనే వచ్చేను కేశవరావు. వినోద్ నన్ను, నా కూతురు అరుణను మోసంచేసేడు. ఇన్నాళ్ళూ వినోద్ అరుణను వివాహం చేసుకుంటాడని అందరం అనుకున్నామా– ఇప్పుడడుగుతే అరుణను అతగాడు ప్రేమించడం లేదుట; అందుకే పెండ్లి చేసుకోనని ఖచ్చితంగా చెప్పేసేడు. ఇన్నాళ్ళూ అరుణతో తిరిగిన తిరుగుళ్ళకు అర్థమేమంటే 'ఆమె నా బంధువు, నా చెల్లెలు వానంతిపట్ల నాకెట్లాంటి అనురాగమో అరుణపట్ల అంతే,' అని సిగ్గులేకుండా ఇప్పుడు చెప్తున్నాడు

అసలు సంగతి వేరు. ఆమధ్యన ఆరునెలలు ఆనంద నిలయంలో వెలగబెట్టేడుకదా – ఆ ఇంటివారి పెద్దమ్మాయిని ప్రేమించాడట– ఆమెనే పెండ్లి చేసుకుంటాడుట. వాళ్ళ నాన్నగారు పోయిందగ్గర్నుంచి ఆ కుటుంబ క్షేమంకోసం నేను ఈ ఆరు సంవత్సరాలు ఎంత శ్రమించేనో, యెంత ఆదరణ చూపేనో నీకు తెలియదా కేశవరావు? ఇప్పుడు వినోద్ ఈవిధంగా నన్ను నా కూతుర్ని అవమానించి మోసంచెయ్యడం ఏమైనా న్యాయంగా వుందా – నువ్వే చెప్పు పైగా అందరికీ తెల్సు వినోద్, అరుణ ఇన్ని సంవత్సరాలు స్వేచ్ఛగా కలిసిమెలసి తిరిగేరని ఇప్పుడు వినోద్ కాదంటే నా కూతుర్ని మర్యాదస్తుడైనవాడు ఎవడు పెండ్లాడుతాడు నువ్వే చెప్పు.

అందుకే నేను కక్ష సాధించదల్చేను నేను, నువ్వు కర్నూలులోని శర్మ, విజయవాడలోని నారాయణరెడ్డి వినోద్ కంపెనీ నుండి వేరైపోయి ఆ నాల్గింటిలోని రెండు ఫ్యాక్టరీలను తీసుకుందాం వాటిని అశోక్ ఇండస్ట్రీస్ అని నీ కొడుకు పేరు పెట్టి, వాటిని అభివృద్ధిపరచి ఆ వినోద్ ఇండస్ట్రీస్‌కి పోటీగా నిలబెట్టి ఆ వినోద్‌ని అణచివేస్తాను ఈ నా సంకల్పంకు నీ మద్దత్తు యెంతో అవసరం – నా మాట కాదనకు."

నందనరావు కోపానికి, ఆవేశానికి కేశవరావు అతని కొడుకు అశోక్ విస్మయంచెందేరు. ఏమి జవాబు చెప్పాలో కేశవరావుకు తట్టలేదు. అశోక్ మెల్లగా కలుగజేసుకున్నాడు

"చూడు మామయ్యా! కోపగించుకోకుండా నా మాట వినాలి. ప్రశాంతంగా ఆలోచించి నాకు జవాబు చెప్పాలి – ఏమంటావు?"

"ఏమిటోయ్ అశోక్ ఏమిటి మధ్యన నువ్వు ఇన్ని షరతులు పెట్టేస్తున్నావు?"

"మరేంలేదు మామయ్యా – నేను అరుణను ఎంతగానో ప్రేమిస్తున్నాను. నాకు తెల్సు వినోద్, అరుణ బాంధవ్యం చాలా నిర్మలమైనది నాకెట్టి అనుమానాలు, అపోహలు ఈ విషయమై లేవు. నీకు వినోద్ ఎంతో నేనూ అంతేవాలి బంధుత్వం చూసుకుంటే - ఒక్క వేలువిడిచేవంటే నేను నీకు మేనల్లుడినేకదా. నువ్వు దయచేసి అనుమతిస్తే నేను అరుణను వివాహం చేసుకుంటాను. ఈ విషయంలో మా నాన్నగారికి, మా అమ్మకు అరుణపట్ల నాకున్న అనురాగం తెల్సు. నా మనస్సులోని కోరిక వాళ్ళకు తెల్సు–ఏమంటావు మామయ్యా?"

నందనరావు నిశ్చేష్టుడయ్యేడు అన్నీ తెల్సికూడా అశోక్ ఇంత విశాల దృక్పథంతో అరుణను పెండ్లి చేసుకుంటానంటే తనేమి అనగలడు! అశోక్ విద్యాధికుడు. అతడు ఆ కంపెనీకు లీగల్ ఎడ్వయిజర్ అశోక్ తండ్రి ఆ కంపెనీలో వాటాదారు. అతడూ ధనవంతుడే- పైగా కేశవరావుది చాలా గౌరవనీయమైన కుటుంబం. అశోక్ చాలా ఉదాత్తుడు.

"ఏం మామయ్యా నేను అరుణను వివాహం చేసుకోడం నీకిష్టంలేదా?" కాస్త హీనస్వరంతో దిగజారిపోతున్న ఆశతో అడిగేడు.

"అదేంత మాట అశోక్ – నాకిష్టం లేకపోవడమేమిటి. నా మనస్సు ఇప్పుడెంత చల్లగావుందో నువ్వు ఊహించుకోలేవు. నా సమస్యకు పరిష్కారం నీవల్ల లభించినందుకు




28–3–'79న విజయవాడలో జరిగిన క్రోక్విల్ క్లబ్ వార్షికోత్సవ సభలో వేదికమీద[ఎడమనుంచి] సభాధ్యక్షులు డా జయదేవ్, ముఖ్య అతిథి ఐన ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణ, ముఖ్య వక్త శ్రీ ఎమ్వీ యల్, ప్రసంగిస్తున్న కార్టూనిస్టు శ్రీ "శంబంగి"

నేనెంతో సంతోషిస్తున్నాను — గాని అరుణ వినోద్ నుండి మనస్సు మరల్చుకుని నిన్ను ప్రేమించగలదా అని, నిన్ను వివాహమాడగలదా అని నా సందేహం.''

అశోక్ హాయిగా గాలి పీల్చుకున్నాడు. తేలికగా నవ్వేసేడు.

''మామయ్యా అరుణ విషయం నాకు వదిలెయ్యి నేను అరుణ మనస్సును మార్చగలను. నువ్వు నిశ్చింతగా వుండు ''

''సరే నీ ఇష్టమే కానియ్యి.''

''బావా! నాదో చిన్నకోరిక,'' అన్నాడు కేశవరావు. ఏమిటన్నట్లు చూసేడు నందనరావు.

''చూడు మనమంతా చాలా దగ్గర బంధువులం వినోద్ అంటే నాకూ ఎంతో అభిమానముంది కోపంలో ఏమేమో నువ్వు అన్నావుగాని నీ రక్తబంధువైన నీ మేనల్లుడికి, నీ స్వంత చెల్లెలుకి నువ్వు హాని చెయ్యగలవా? చెయ్యలేవనే నా మనస్సు చెప్తుంది. అందుకే అట్లాంటి తలంపే రానివ్వకు పెద్దవాడివి నీ ఆశీర్వచనం లేనిదే నీ మేనల్లుళ్ళు వినోద్ అయితేనేం, అశోక్ అయితేనేం వర్ధిల్లలేరు. నా సంగతి తెల్సుగా — నేను అనారోగ్యంతో బాధపడుతున్నాను ఈ జీవిత నాటకాన్ని చూడడమేగాని ఏమీ చేయలేని స్థితి నాది బావా! నా కోరికను మన్నించి వినోద్‌పట్ల వైశత్యం వదలుకో. అశోక్‌ని నీ అల్లుడిగా చేసుకో వాడికి అరుణంటే తగని ప్రేమ''

నందనరావు తల పంచుకుని మౌనంగా ఊరుకున్నాడు ఆసరికే అతడి మనస్సులో ఆవేశం కొంతమట్టుకు తగ్గిపోయింది

## 20

నందనరావు మనస్సులో ఎన్నో ఆలోచనలు చెలరేగుతున్నాయి ఇంటికి రాగానే హాలులో కూర్చుని ఓ సినీమా పత్రికను చూస్తున్న కూతురు అరుణ దగ్గరకు వెళ్ళి ఆమె ప్రక్కన సోఫాలో కూర్చున్నాడు అరుణ పుస్తకాన్ని ప్రక్కన పెట్టి తండ్రివైపు తిరిగింది. తండ్రి ముఖంలో విషాదచ్ఛాయలు గమనించింది

''ఏమండీ నాన్నా అలా ఉన్నారు ?''

''నీకు ఎలా చెప్పాలో తెలియడంలేదు తల్లీ!''

''ఫరవాలేదు చెప్పండి—దేనిగురించి నాన్నా?''

''వినోద్ మనని మోసం చేసేడమ్మా అతడు నిన్ను పెండ్లి చేసుకుందుకు ఇష్టపడడం లేదు. ఎవరో లావణ్యను పెండ్లాడుతాడట. తల్లీ నీతో ఇన్నాళ్ళు కలసిమెలసి తిరిగి యెంత మోసం చేసేడో తల్చుకుంటేనే నా హృదయం బద్దలౌతుందమ్మా''

''నాన్నా! మీరు అంతగా బాధపడనవుసరం లేదు వినోద్‌ని ఇన్నాళ్ళు మనం దేముడుగా భావించేం, గాని అతడి కాళ్ళు మట్టివే అని నేను రెండు రోజుల క్రిందటే తెల్సుకున్నాను. వినోద్ మోసగాడే కాదు, గుణహీనుడుకూడా అతడు మనస్సు మార్చుకుని నన్ను పెండ్లాడుతానన్నా అతణ్ని వివాహం చేసుకునేందుకు నేను సిద్ధంగా లేను నాన్నా. నాకు ఆ సంబంధం ఇష్టంలేదు అందుచేత మీరా విషయంలో చింత పెట్టుకోకండి ఏది జరిగిన మన మేలుకే అని తెల్సుకోండి.''

''అయితే, అరుణమ్మా! ఇన్నో విషయం అడగాలి. మొహమాటం లేకుండా చెప్పు — అశోక్ అంటే నీ కెట్లాంటి అభిప్రాయముంది ?''

''అశోక్ మంచివాడు, సహృదయుడు ముఖ్యంగా మంచి నడవడిక ఉన్నవాడు — ఏం ?''

''అశోక్ నిన్ను మనసార ప్రేమిస్తున్నాడని నాతోను, వాళ్ళ నాన్నగారితోను చెప్పేడు నీకు సమ్మతమైతే నిన్ను వివాహం చేసుకుంటానంటున్నాడు. ఈ విషయంలో నీ ఉద్దేశం తెల్సుకుని ఆ విధంగా చేద్దామనుకుంటున్నాను నీకు ఈ పెండ్లి ఇష్టమేనా అమ్మా?''

''నా పెండ్లి కిప్పుడు తొందరేమొచ్చింది నాన్నా పైగా నా మనస్సు ఇప్పుడదోలాగుంది నాకేమి చేయడానికి తోచడంలేదు.''

''అదికాదమ్మా — నా శరీరంలో ఈపాటి శక్తి వున్నప్పుడే నీ పెండ్లి చేసెయ్యాలి వచ్చే రోజులు ఎట్లాంటివో మనం చెప్పలేంకదా. నా తొందరని అర్థంచేసుకుని నాతో సహకరించు తల్లీ ఇంతకీ నీకు అశోక్‌తో పెండ్లి ఇష్టమేనా చెప్పు, లేకుంటే ఈ వివాహమే వద్దు. నేను నిన్నేమీ బలవంతంచేసి ఒప్పించను.''

''సరే — నీ ఇష్టమే నా ఇష్టం నాన్నా!''

నందనరావు మనస్సు ఎంతో తేలికైంది

''అరుణమ్మా! త్వరలోనే మంచి ముహూర్తం చూసి ఈ వివాహం జరిపిస్తాను అశోక్ నీకన్నివిధాల తగినవాడు యోగ్యుడు. నాకిప్పుడెంతో సంతోషంగా వుంది. నాకు మరే చింతా లేదు''

తండ్రి ఆనందాన్ని చూస్తుంటే అరుణకు కొంత తృప్తి కల్గింది ఇంతలో వినోద్ తల్లి కమలాదేవి నందనరావు ఇంటికి వచ్చింది. నందనరావు చెల్లెల్ని పలుకరించలేదు, కూర్చోమని అనలేదు. అరుణ లేచి మేనత్తకు ఎదురువెళ్ళి ఆహ్వానించి తన ప్రక్కన సోఫాలో కూర్చోబెట్టుకుంది. కమలాదేవి తన అన్న నిర్లిప్తతను గమనించింది. మనస్సు చివుక్కుమంది

''అన్నయ్య — నన్ను క్షమించు! వినోద్ నిరాకరణకు, నాకు ఎట్టి సంబంధంలేదు నీకు నా మనస్సు తెల్సుకదా! లక్ష్మిలాంటి అరుణ నా ఇంటి కోడలైతే నేను సంతోషించినట్లు ఇంకెవరైనా నా ఇంటికి కోడలుగా వస్తే నేను సంతృప్తిచెందలేనని నీకెన్నోసార్లు చెప్పేను. ఇప్పుడూ అదే అంటున్నాను వినోద్ యెందుకలా ప్రవర్తిస్తున్నాడో నా కర్థంకావడంలేదు. ఆ లావణ్య ఏ మత్తుమందు జల్లిందో, ఏ మంత్రం వేసిందో నాకు తెలియడంలేదు —కానీ వాడు ఆ ఊరునుంచి వచ్చింతరువాతే యిలా మారిపోయేడు అన్నయ్య! నన్నేంచెయ్యమన్నావు చెప్పు వాళ్ళ నాన్నగారు బ్రతికుంటే ఇట్లాంటి అన్యాయం జరుగకపోను.

ఇట్లాంటి పరిస్థితిలో నేనెంతనిసహాయురాల్నో నువ్వు గ్రహించలేవా అన్నయ్యా? నన్ను అర్థంచేసుకుని క్షమించు ఒకేరక్తాన్ని పంచుకుని పుట్టినవాళ్ళం చిన్నప్పటినుండి కలసి పెరిగిన తోబుట్టువులం మనిద్దరం నువ్వు నామీద ఆగ్రహంచెందితే నేనెట్లా ప్రశాంతంగా వుండగలను చెప్పన్నయ్యా? నువ్వావాడు కోపంతో వినోద్ పతనం చూస్తానని, వినోద్ ఇండస్ట్రీస్‌ని ముక్కలుచేసి వాడ్ని సర్వనాశనం చేస్తానని శపథంచేసి వచ్చిందగ్గర్నుండి, నేనెంతగా దుఃఖిస్తున్నానో నీకు తెలియదు అన్నయ్యా! నువ్వు వినోద్‌ని నాశనంచేస్తే వాడితోబాటు నేను, నీ మేనకోడలు వాసంతి కూడ నాశనమవాలని నీకు తెల్సునా? అన్నయ్యా! మమ్మల్ని క్షమించి కోపాన్ని దిగమింగి, మునుపటిలా ఆప్యాయంగా మాతో మాట్లాడవూ!'' అని ప్రాధేయపడింది ఒక్కగానొక్క తోబుట్టువుకు దూరంగా వుండలేక

[ఇంకా వుంది]

## గ్రీష్మ తాపాలు

— డి. విల్ ఎన్ శాస్త్రి

సూర్యుని కోపాగ్నికి భగ్గుమంటున్నది బెజవాడ
తారురోడ్డుమీద కరిగే తారు జోడులేనివాడికి బేజారు
కృష్ణ పక్కనే ఉంది కాని తృష్ణ తీరటంలేదు
మిట్ట మధ్యాహ్నం పన్నెండు-అక్కడా అక్కడా నరసంచారం
ఏ పీ సెబ్బువాళ్ళ పవరు కట్లు ప్రజలకు మరిన్నిక్కట్లు
జీవితమే ఓ ఎడారి అందులో ఒయాసిస్సు వెతికే రిక్షావాలా
సమ్మరులోనేకాని కరుణించడా వెంకటరమణమూర్తి?
తిరుమల ఎక్స్‌ప్రెస్ బెర్తులన్నీ భర్తీ
పాపం బ్రతుకుతెరువుకు వలసవచ్చిన పక్షులు
పేవ్‌మెంటే ఇల్లుగా గడిపే వ్యవసాయ కూలీలు
ఆర్టీసీ డిపోలో పెళ్ళిళ్ళ సీజను కోలాహలం
బస్సు దొరకని ప్రజలకు ఎండ ఒక హాలాహలం
గవర్నరుపేట జంక్షను దగ్గర కూల్‌డ్రింకు షాపులు
యధావిధిగా సమ్మరులో పెరిగే గిరాకీలు
అక్కడక్కడ మల్లెల గుబాళింపులు
కోర్కెలు రేకెత్తించే తలపులు
ఎంత ఎండయినా తెలుగువాడూరుకుంటాడా?
సినిమాహాలు దగ్గర కొత్త సినీమా సందడి
అవును నిజంగా విజయవాడే, తెలుగువాడ.

(గత సంచిక తరువాయి)

























[ఇంకా వుంది]




**ఎస్. వి. ఎస్. విశాఖపట్నం**

నా వయస్సు 18 సంవత్సరములు. చిన్నతనము నుండి నా వాయిస్ సన్నగా వుంటుంది దీనికి నివారణోపాయము ఏమిటి? చికిత్సాలయములు ఎక్కడైనా వున్నవా?

మీరు హైదరాబాద్, విశాఖపట్నం మొదలయిన చికిత్సా కేంద్రాలలోని ఇ ఎన్ టి విభాగాలలో గొంతు పరీక్ష చేయించుకోవటం మంచిది వయస్సు వచ్చే కొద్దీ గొంతులో మార్పు వచ్చే అవకాశం కొంత ఉన్నా, మీ విషయంలో ఎక్కువ ఫలితం ఉంటుందని చెప్పటం కష్టం.

**పి వి ఆర్ — వెంకటగిరి**

నా వయస్సు 25 సం.లు. నాకు చిన్నతనము నుండి ఇప్పటివరకు చెవిలో చీము కారుతోంది. వేసవిలో ఎక్కువగాను, శీతాకాలంలో తక్కువగాను చీముకారటం జరుగుతోంది. డాక్టరును సంప్రదించి ఎక్సరేలు తీసి రెండు కర్ణభేరులు రంధ్రములు పడినవని, బాగుచేయుట వీలు కాదని, కాని చీముకారటం నిలుపుచేయవచ్చునని డాక్టర్ చెప్పినారు. ఒక ఇయర్ డ్రాప్సు వ్రాసి ఇచ్చినారు చెవిలో నీరు పోకుండా జాగ్రత్త తీసుకోమని సలహాఇచ్చినారు. ఈ మందువాడినపుడు చీముకారటం తాత్కాలికముగా నిలుపుదల అయినది. దీనికి పూర్తి నివారణ ఏమిటి?

చెవులలో చీముకారుతూ ఉంటే ఆ చీమునితీసి పరీక్షా నిలయములలో "కల్చర్ అండ్ సెన్సిటివిటీ" అనే పరీక్ష చేస్తారు. అంటే ఏ క్రిముల వల్ల ఈ చీమువస్తున్నది, ఆ క్రిములు ఏఏ మందులకి లొంగేదీ పరిశీలించి నిర్ణయించటం. ఏమందుకైతే లొంగుతుందని రిపోర్టు వస్తుందో, ఆ మందుని, చెవిలోను, నోటి ద్వారాను వాడటం వల్ల చీమురావటం తగ్గిపోతుంది. అలా చేయకపోతే తాత్కాలిక నివారణ మాత్రమే జరుగుతుంది.

**పి. వి ఆర్. — శ్రీరామపురం**

మా పాప వయస్సు 4 సంవత్సరములు. 6 నెలలనుండి ముడ్డినుంచి పేగు వచ్చుచున్నది. పేగుజారుతున్నది అని కొంతమంది డాక్టర్లు అంటున్నారు. పిల్లవయస్సు పెరిగేకొద్దీ బలమైన ఆహారము వలన లోపలికి పోతుందని కొంతమంది అంటున్నారు. డాక్టర్లు వ్రాసిఇచ్చిన మందులు వాడుతున్నాము. కాని తగ్గలేదు.

దీనిని ప్రోలాప్స్ రెక్టమ్ అని అంటారు. గుద ప్రాంతంలో ఉన్న కండరాల పటుత్వం తగ్గినప్పుడు ఇలా జారిపడం జరుగుతుంది. కడుపులో ఒకరకమైన క్రిములు ఉండటం వల్ల, తరచూ విరేచనాలు ఏర్పడి, కండరముల పటుత్వం తగ్గి ఇలా ఏర్పడుతుంది.

మలపరీక్ష చేయించి క్రిములు ఉన్నదీ, లేనిదీ నిర్ణయించి తగినమందువాడాలి. తర్వాత గుద ప్రాంతంలో ప్లాస్టరీ వేయడం ద్వారా దీనిని నివారించవచ్చును. దీనికీ తగ్గకపోతే శస్త్రచికిత్స ద్వారా తప్పక నయమవుతుంది.

**ఎన్ పి — సాలూరు**

కుష్ఠువ్యాధి అంటువ్యాధికాదా? కుష్ఠువ్యాధి పూర్తిగా తగ్గుటకు మందులున్నవా? వుంటే ఆ మందులపేర్లు, అవి ఎంతకాలము వాడవలెనో తెలుపప్రార్థన.

కుష్ఠువ్యాధి అంటురోగమే అయినా మిగతా అంటురోగాల మాదిరిగా అతిత్వరగా ఇతరులకి వ్యాపించెందే రోగంకాదు. కొన్ని సంవత్సరాల పాటుగా లెప్రోమేటస్ లెప్రసీతో బాధపడే వారితో చాలా దగ్గరగా మసలిన వారికి ఈ రోగం రాగల అవకాశం ఉంటుందని తెలియవస్తున్నది. ఈరోగాన్ని అరికట్టడానికి, డైఅమైనో డైఫినైల్ సల్ఫోన్ మాత్రలు బాగా పనిచేస్తాయి. ఇదిగాకుండా ప్రస్తుతం రిఫాంపిసిన్ మొదలయినవి కొన్ని సందర్భాలలో వాడితే మంచి ఫలితాలనిస్తాయని తెలియవస్తున్నది. ఈ మందులని వైద్య పర్యవేక్షణలో, రోగ ఉధృతాన్నిబట్టీ, రోగ తెగువబట్టీ కొన్ని సంవత్సరాలపాటు వాడవలసి ఉంటుంది. ఎంతకాలం అనేది వైద్యులు పరీక్షానంతరం నిర్ణయించాలి.

**జి వి. ఆర్. — శ్రీశైలం**

నా కుమారునికి మూడు సంవత్సరముల వయస్సులోట బి మెనింజైటిస్ అను వ్యాధి వచ్చి దానితో ఫిట్సుకూడా వచ్చినవి. ఆ సమయములో కండ్లు కుపించకుండా పోయినవి కొంతకాలము మందులు వాడగా ఇప్పుడు కొంచెము కనుపించుచున్నవి. దగ్గర వస్తువులు పెద్ద అక్షరములు కనిపిస్తాయి. చిన్నవస్తువులు, అక్షరాలు కనుపించవు. కొందరు డాక్టర్లు ఇంతకంటే ఎక్కువ కనుపించవు ఇంతవరకే కనుపించును అని చెప్పుచున్నారు ఒకవేళ నా కుమారునికి ఆ విధముగా జరిగినట్లయితే నాకన్నుఒకటి తీసి వానికి అమర్చిన యెడల వానికి కంటిచూపు బాగుండుటకు అవకాశము వున్నదా?

మీ కుమారునికి ఏర్పడిన రోగం కండ్లలో కాదు. మెదడు పైపొర వాయటం వల్ల, మెదడు నుంచి కంటికి వచ్చే ఆప్టిక్ నరం బాధింపబడినందువల్ల దృష్టిమాంద్యము ఏర్పడినది. కండ్లలో కార్నియా, లెన్స్ మొదలయిన వాటిలో ఏర్పడిన లోపాలకయితే మరొకరి కండ్లు అమర్చటం వల్ల నివారించే అవకాశం ఉన్నది. కాని ఈ రోగం వల్ల వచ్చిన దృష్టిలోపం మందులవల్ల కాలక్రమేణా తగ్గవలసిందే!

**కె. వి ఆర్. — గుడివాడ**

నా వయస్సు 21 సం లు. విడమైపుటీజము కుడివైపుకన్నా కొంచెము లావుగా ఉన్నది. రాత్రి సమయము, ఉదయము మామూలుగానే వుంటుంది. ఇది ఏమీ ప్రమాదముకాదు కదా! ఇలా ఎందువలన వస్తుంది? నివారణోపాయము ఏమిటి?

మీరు శస్త్రవైద్యులకి చూపించుకోవటం మంచిది. విశ్రాంతి సమయంలోను, ఉదయము మామూలుగా ఉండటం వల్ల కడుపులోని ప్రేగులుగాని, కడుపులో చేరిన నీరుగాని ఎడమవైపుకి జారుతూ ఉండటం వల్లగాని, లేక హైడ్రోసిల్ వలనగాని ఈ వాపు ఏర్పడుతూ ఉండవచ్చు.

దీనికి ప్రత్యక్షంగా పరీక్షచేసి గాని రోగ నిర్ధారణ చేయుటం కష్టం. ఏ విధమైన కారణం వల్ల అయినా, శస్త్రచికిత్స ద్వారా తప్పకనివారణ లభిస్తుంది.

—డా॥ కె. వెంకటేశ్వరరావు






ప్రఖ్యాత రచయిత సాంబయ్యగారి మరణ వార్త పేపర్లో చదువుతూనే, ఆవార్త ప్రచురించిన 'కాలం' పొడుగునా ఎర్ర సిరాతో అండర్‌లైన్ చేసినట్టు అనిపించింది నాకు. (ఈ గీతల సంగతి తరువాత చెప్తాను.)

సాంబయ్యగారిది హఠాన్మరణమే.

యాభై దాటిన వయసే అయినా ఎప్పుడూ ఆరోగ్యంగా ఉల్లాసంగా కనిపించే వారు. ఆయన వచన రచనా శైలిలో కనిపించే లాలిత్యమే ఆయన పెదవుల మీద కూడా సదా తళుక్కున మెరుస్తూ కనిపించేది.

సాంబయ్యగారి మరణం పట్ల ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తపరుస్తూ దేశం నలుమూలల నుంచీ ప్రముఖులూ, సాహిత్య వేత్తలూ, రచయితలూ పంపిన సందేశాలు మరునాటి రోజు నుంచీ పత్రికలలో ప్రముఖంగా ప్రచురింపబడ్డాయి. ఆకాశవాణి ఈ వార్తను విషాద స్వరంతో ప్రసారితం చేసింది.

సాంబయ్యగారితో వ్యక్తిగత పరిచయమూ ఆత్మీయతా ఉన్న ప్రముఖులూ, అభిమానులూ, రచయితలూ కొందరు కలిసి 'సాంబయ్య స్మారకనిధి'ని ఏర్పాటు చెయ్యటానికి ఒక సంఘంగా ఏర్పడ్డారట.

సాంబయ్యగారు పరమపదించిన మూడు నెలలకి గాబోలు, సదరు సంఘం నుంచి నాకో లేఖ వచ్చింది. స్మారక నిధిని ఏర్పాటు చేసి సాంబయ్యగారి కుటుంబానికి ఎంతో కొంత చేయూత నివ్వటంతో బాటు, ఆయన సాహిత్య సేవను సమగ్రంగా చర్చించటానికీ ఆయన జీవిత విశేషాలను జనానికి అందించటానికీ 'సాంబయ్య స్మారక సంచిక' ప్రచురించాలని సంకల్పించారట. సాంబయ్య గురించి నన్నొక వ్యాసం పంపవలసినదిగా వారి అభ్యర్థన!

వార్తవిని కలవరపడటం వేరూ, మనసు సానుభూతితో స్పందించటం వేరూ! స్మారక సంచికకు రచన చెయ్యటం వేరూను.

సాంబయ్యగారి గురించి నేనేదైనా రాయవలసి ఉందనేసరికి— నా అంతరంగం పరిపరి విధాలుగా ఆయనకూ నాకూ ఆత్మీయత పెనవేసుకున్న రోజులవైపు పరుగుతీసింది.

ప్రఖ్యాత రచయిత సాంబయ్యగారికీ నాకూ—చాలా దగ్గరి సాన్నిహిత్యం ఉండిన మాట నిజం. కాని, అది సుమారు తొమ్మిది సంవత్సరాల క్రితం మాట!

లోకానికి చాలావరకూ తెలియకపోవచ్చు, తెలియగలిగినా లోకం ఎప్పుడూ పట్టించుకుని ఉండి ఉండక పోవచ్చుగాని — ఇటీవలి కాలంలో సాంబయ్యగారికీ నాకూ సయోధ్య లేదు!

ఆ—ఈ— కారణాల వల్ల ... సాంబయ్యగారి గురించి వ్యక్తిగతంగా గాని, ఆయన సాహిత్య కృషి గురించి గాని నేను రాయగలగటం చాలా కష్టం.

కారణాలూ వగైరా ఏకరువు పెట్టకుండా, సాంబయ్య స్మారక సంచికకు రచన చెయ్యటానికి ప్రస్తుతం నాకు తీరిక లేదనీ, పనుల ఒత్తిడి అధికంగా ఉందనీ — ఏవో సాకులు చెబుతూ సాంబయ్య స్మారక సంఘం వారికి క్షమాపణలతో ఉత్తరమొకటి రాసి, తప్పించుకో జూశాను

నా సాకులూ పనిచెయ్యలేదు. సంఘం వారు నన్ను వదిలిపెట్టనూ దలచలేదు. పనిగట్టుకుని ఒక కార్యకర్త నా దగ్గరికి రానేవచ్చా — "లేటైనా ఫరవాలేదు... మీ రచన లేకుంటే స్మారక సంచికకు నిండుదనం ఉండదు ... సాంబయ్యగారికి చాలా దగ్గరగా చనువుగా చాలాకాలం ఉన్నవారిలో మీరు ముఖ్యులు ... ఆ సినిమాలూ అవీ ఆయనను మరి బిజీగా చేసేసి చివరిదినాల్లో మీరు మునుపటిలా కలుసుకోవటం పడలేదనుకోండి.. అయినా ఆ ఆత్మీయత లెక్కడికి పోతాయి? దయచేసి మీరు తప్పకరాయాలి. మీ కోసం నాలుగు ఫుల్ పేజీలు ఖాళీగా ఉంచుతాం."

అసంకల్పితంగానే అయినా అంత మొగమాట పెట్టించుకున్నాక, ఇక స్మారక సంచికకు రచన చెయ్యటం తప్పని సరయింది

తీరా పూనుకున్నాక, అన్నీ సమస్యలే ఎదురైనాయి. నా లైబ్రరీ అంతా గాలించినా సాంబయ్యగారి పుస్తకాలు రెండుకి మించి దొరకలేదు. పత్రికలూ గట్రా జాగ్రత చేసే అలవాటు నాకు బొత్తిగా లేకపోయె!

వ్యక్తిగతంగా సాంబయ్యగారి గురించి నేను రాయటం కుదరదని ముందే తీర్మానించుకున్నాను. ఆయన రాతలూ, వెంటనే చాలినన్ని దొరికేలా లేవు. విన్నో చదివి ఉన్నాను గాని, ప్రముఖంగా పేర్కొనదగినవంటూ గుర్తు రాలేదు. ఉద్యోగ విధులు నిర్వర్తించటంలో—కొన్నిరోజులు సాంబయ్య

# బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్

# 3 తరాల వారికి అదే కమ్మని రుచి



గ్రీన్ లేబిల్ అనేక సం॥లగా బామ్మగారు దాన్ని ఉపయోగిస్తున్న విధం



గ్రీన్ లేబిల్ - అమ్మ దాన్ని ఉపయోగిస్తున్న విధం



అదే గ్రీన్ లేబిల్ మీరు మెచ్చుకొనే విధం మరియు మీరు ఉపయోగించే విధం

మూడు తరాల వారికి అభిమాని కావడంలో ఆశ్చర్య పడనవసరం లేదు. మరియు ఈ రోజు అందుకే అధికంగా అమ్ముడవుతుంది




**ఎల్లప్పుడూ శ్రేష్ఠమైనది. స్ట్రాంగైనది**

OBM 5709 A I Tel

# ఎర్రగీతలు

గారి గురించి ఆలోచించే తీరికలేకపోయింది.

ఈలోగ స్మారకసంపుటం వారినుండి అప్పుడప్పుడూ గమనికలు అందుతూనే ఉన్నాయి.

ఏమైనా కానిమ్మనుకుని ఒక రాత్రంత నిద్రమేలకుని సయత్నించి సాంబయ్యగారి గురించి రాత మొదలెట్టి పేజీ తిరక్కుండానే రాసింది చించేశాను నా గిలుకు నాకే కృతకంగా అనిపించింది!

కానీ సాంబయ్యగారికీ నాకూ ఒకానొకప్పుడు ఉండిన ఆత్మీయ పరిచయాన్ని [illegible] పూర్తిగా ఒకసారి సింహావలోకనం చేసుకోవాలని పించింది నాకు!

అప్పుడు నేను చిన్నవాణ్ణి. ఉత్సాహానికి- కుర్రవాణ్ణి. పత్రికలూ పుస్తకాలూ అందినవి అందినట్టు చదివి పడేస్తూ, తెల్లకాగితాలు చూసి ఆవేశపడిపోయి చేతికొచ్చింది గిలికి పడేస్తూ, వాటిని పోస్టుచేసి పత్రికలకూ పంపిస్తూ, అవి అచ్చు పడితే ఆనందిస్తూనూ తిరిగొస్తే గొప్ప విషాదాన్ని అనుభవిస్తూనూ ఉండే రోజులవి.

ఆ రోజుల్లోనే సాంబయ్యగారితో నాకు పరిచయం కలిగింది. ఎక్కడో ఏమిటో గుర్తురావటం లేదుగాని, ఏదో కవిసమ్మేళనం సందర్భంలో కాబోలు— ఎవరో నన్ను ఆయనకి పరిచయం చేశారు "నమస్కారమండీ" అని నేననగా .. "నమస్కారం బాబూ!" అని ఆయన తళుక్కుమనే ఆ మధుర హాసంతో నావేపు చూడటం మాత్రం- ఆ తరువాత చాలా రోజుల పదేపదే గుర్తొస్తూ ఉండేది

మనిషికీ మనిషికీ మధ్య స్నేహం ఎప్పుడైనా ఎలా అయినా కలిగి పెరిగి ఆత్మీయంగా పెనవేసుకోవచ్చు. సాంబయ్యగారు నాపట్ల ఆనాడు చూపిన వాత్సల్యం నన్ను ఆయన స్నేహబంధంలోకి వశపరుచుకోవటం అతి సులువుగా జరిగిపోయింది.

చిత్రమేమిటంటే- ప్రథమ పరిచయం దాకా సాంబయ్యగారి రచనల పట్ల నాకో ప్రత్యేకమైన అభిమానం ఏమీలేదు తరచు ఆయన రచనలు చదివిన గుర్తేగాని, అవి నన్ను మరీ బలవత్తరంగా ప్రభావితం చెయ్యటం జరగలేదు. అయితే — పరిచయమయాక మాత్రం సాంబయ్యగారి ప్రతి

రచనలూ ప్రత్యేక శ్రద్ధతో చదువుతూ ఉండేవాణ్ని చదివి, ఆయనతో విప్పటి కప్పుడు ఆసక్తిగా చర్చిస్తూ ఉండేవాణ్ని కూడా.

సాంబయ్యగారికి అభిమానులకు కొదువ లేదు వయసునా గౌరవంలోనూ పలుకుబడి లోనూ వన్ను మించిన వారెందరితోనో ఆయనకు పరిచయాలూ స్నేహాలూ ఉండేవి. అయినా, ఆ అందరిలోనూ ప్రత్యేకించి నావట్ల ఆయన చూపే శ్రద్ధా వాత్సల్యమూ వన్ను ముగ్ధుణ్ని చేస్తూ ఉండేవి.

ఆ రోజుల్లో నేను వయసుకి మించిన ఆలోచనలతోనూ రచనోత్సేకంతోనూ సతమతమౌతూ ఉండేవాణ్ణనే చెప్పుకోవాలి. (కొంతవరకు అసందర్భమే అయినా!)

సాంఘిక దురన్యాయాలు, పెచ్చు పెరిగే అవినీతి, నిరుద్యోగమూ వగైరా — నా మనసును విపరీతంగా కలచి వేస్తూ ఉండేవి.

రచనా, సాంఘిక ప్రయోజనమూ మొదలైన భావాలను అప్పుడప్పుడే ఒంట పట్టించుకునే దశనాది.

సాంబయ్యగారితో సాహిత్య విషయాలు చర్చిస్తూ ఉండటం నాకో చక్కటి అనుభూతిగా ఉండేది. సాహిత్య జీవితం ఏ కారణం చేతనైనా, ఒక ఎడారిలా అనిపిస్తే ఆ క్షణాల్లో సాంబయ్యగారి సాన్నిహిత్యం ఒక ఒయాసిస్‌లా ఊరట కలిగిస్తూ ఉండేది.

సాంబయ్యగారు తరతమ భేదాలున్న మనిషిలా కనిపించేవారు కారు ఆయ వింటికి నేనెంత తరచుగా వెళ్ళేవాణ్నో, మా ఇంటికి ఆయనా అంత తరచుగానూ వచ్చేవారు. పుస్తకాలూ, సాహిత్య విశేషాలూ, దేశపరిస్థితులూ, సినిమాలూ ..... వగైరా అనేక విషయాలు చర్చనీయాంశాలుగా ఉండేవి.

వింతైనా రచయితలు కొంచెం ప్రత్యేక వ్యక్తులు గదా! రచయితల కొన్ని అలవాట్లూ, మాటల ధోరణీ — ఆసక్తికరంగా ఉంటాయి. సన్నగా పొడుగ్గా రివటలా ఉండే సాంబయ్యగారికి పొడుం పీల్చే అలవాటుండేది. మధ్య మధ్యన గోల్డ్ ఫ్రేం కళ్ళద్దాలు చప్పున తీసి జుబ్బా అంచుతో శుభ్రంచేసి మళ్ళీ పెట్టేసుకోవటం ఆయన అలవాటు. నవ్వటం వింత సహజమో ఆయన నవ్వుకోవటమూ అంతే సహజం కొత్త పుస్తకాలు సేకరించి చదవటంలో చాలా ఉత్సాహం ఉండేది ఆయనకి. నా దగ్గరుండే పుస్తకాలు అప్పుడప్పుడూ పట్టుకెళ్తూ ఉండేవారు.

'పుస్తకం వనితా విత్తం' అనే హెచ్చరికను చాలావరకు పాటించే వాడినే అయినా, సాంబయ్యగారి విషయంలో అలా ప్రవర్తించే వాణ్ని కాను. ఎంతటి 'పద్ధతి మనుషు' లైనా పుస్తకాల విషయంలో మాత్రం కొన్ని చిన్న బలహీనతలకు లొంగిపోక తప్పదేమో!

నా దగ్గర్నుంచి పట్టుకెళ్ళే పుస్తకాలు చాలామటుకు చదివిన వెంటనే సాంబయ్యగారు తిరిగిచ్చేసే వారేగాని, కొన్ని మాత్రం చాలా రోజులు అట్టే పెట్టేసుకునేవారు. నేనా — పుస్తక రాక్షసుణ్ని! రావలసిన పుస్తకాల గురించి నిర్మొగమాటంగా అడిగే వాణ్ని. "అదా... ఆ పుస్తకమా... యిస్తాను ...చదివేశాను...ఎక్కడ పెట్టేశానో గుర్తు



రాయాలని నా తాపత్రయం. రాసిన కొన్ని చెప్పుకోదగినవిగా ఉండాలని నా ప్రయత్నం. వింతగా అమోదించలేకున్నా, రచనేవృత్తిగా ఉన్న సాంబయ్యగారికే నేనొక శత్రువుగా కనిపించటాన్ని — అర్థం చేసుకున్నాను!

ఏడెనిమిదేళ్ళ క్రితం సాంబయ్యగారు సినీరచయితగా మారిపోయారు. అప్పుడప్పుడూ సినిమాలకు కథలూ మాటలూ రాస్తున్నారు. ఈ హడావుడిలో ఆయనకు మునుపటిలా సాహిత్య వ్యక్తులతో గడిపే అవకాశం సన్నగిల్లింది. నన్ను పలకరించటం, కనీసం పైపైనైనా ఆత్మీయంగా ఉండటం— అనీ మానేసి చాలా కాలమైంది. ట్రాన్స్‌ఫర్ల మీద ఊళ్ళు తిరుగుతూ, ఉద్యోగ నిత్యకృత్యాల్లో ఉన్న నేనూ సాంబయ్యగారి గురించి దాదాపు పూర్తిగా విస్మరించాను. పత్రికలలో ఆయన పేరు అడపాదడపా కనిపించినా మునుపటిలా ఆయన రాతల్ని ఆసక్తితో చదవటంలేదు. ఆయన గురించి అంతగా ఆలోచించాల్సి వస్తుందని అనుకోలేదు. సాంబయ్య స్మారక సంచిక పుణ్యమాని కాకుంటే సాంబయ్య నాకు మళ్ళీ ఒకనాటి సమస్య అయినా అయేవాడే కాదు!

* * *

స్మారక సంచిక కోసం రచన చేసే ఆలోచనలో నేనుండగానే ఆఫీసు పని మీద రెండురోజుల ప్రయాణం తగిలింది నాకు. పని ముగించి ఒక సాయంవేళ గూడూరు-తిరుపతి రైల్లో వస్తున్నాను. రైల్లో హఠాత్తుగా పలకరించాడు చిదంబరం. చిదంబరం ఎవరో కాదు - సాంబయ్యగారి ఏకైక పుత్రుడు!

"బాగున్నారా మేష్టారూ? చిన్నాళ్ళకి కనిపించారు!..."

నేనూ చాలా ఆశ్చర్యపోయాను. చాలా చిన్నవాడిగా చూశాను చిదంబరాన్ని, చాలా ఎదిగిపోయాడు. వ్యవహారజ్ఞుడిలా కనిపిస్తున్నాడు.

సాంబయ్యగారి మృతిపట్ల నా సంతాపాన్ని వ్యక్తపరిచాను.

శ్రీకాళహస్తిలో రైలు ఆగింది. చిదంబరం నా సంచి పుచ్చుకున్నాడు. "పదండి మేష్టారూ... యింటికెళ్దాం...ప్రొద్దున వెళ్దురుగాని.."

ఏమనటానికీ తోచింది కాదు. చిదంబరం ఆప్యాయత కృతకమనుకోలేను. సగం అభ్యంతరంతోనే-రైలు దిగేశాను.

మాట్లాడుతూనే ఉన్నాడు చిదంబరం. మనసు బాగులేదు నాకు.

సాంబయ్యగారిది ప్రశాంత మరణమే! కూతుళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళయిపోయాయి. చిదంబరానికి మంచి ఉద్యోగం దొరికింది. మంచి సంపన్న కుటుంబం నుంచి వచ్చింది

## విశాఖపట్నం ఓడరేవు

6 లక్షల జనాభా గల విశాఖపట్నంలో నూనె శుద్ధి కర్మాగారం, జింకు కర్మాగారం, రసాయనిక ఎరువుల కర్మాగారం వంటి ఆధునిక పరిశ్రమలు దేశ ఆర్థిక వ్యవస్థలో ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి ఓడల నిర్మాణ పరిశ్రమ భారత దేశంలో కెల్లా మొట్టమొదట నెలకొల్పబడింది

1933 లో యీ ఓడరేవు నిర్మాణం జరిగింది ఆనాడది సాలీనా లక్ష టన్నుల రవాణా జరిపేది నేడది కోటి టన్నుల సరకు రవాణా జరుపుతోంది ఈనాడిది భారత దేశపు మూడో పెద్ద ఓడరేవు, తూర్పు తీరానికల్లా పెద్దదీను ఈ మధ్యనే నిర్మించిన వెలుపలి ఓడరేవు యిచటి రేవు కార్మికులకు గర్వకారణంగా వుంది ఈ వారధిలో 25 లక్షల ఘనపు మీటర్ల రాయి, 50 టన్నుల బరువుగల 2 80,000 ఘనపు మీటర్ల కాంక్రీటు పలకలు వాడారు భారతదేశం ముఖ్య ఎగుమతుల్లో ఒకటైన ముడి ఇనుము ఎగుమతి యీ రేవు మొత్తం రవాణాలో సగం వుంటుంది. రోజుకి లక్ష టన్నుల ముడి యినుము ఓడలోకి ఎక్కించగలరు

## ఎర్రగీతలు

భార్య. సాంబయ్యగారు తమ కుటుంబానికి సమస్యలేమీ మిగిల్చి పోలేదు

"అమ్మయితే మిమ్మల్నెప్పుడూ తలుచుకుంటూనే ఉంటుంది మేష్టారూ! . ఆ పెళ్ళిళ్ళొచ్చి నాన్నను బాగా మార్చేశాయి. మదరాసులో మకాం ఎక్కువౌతూ మునుపట్లా ఇంటి దగ్గర సాహిత్య గోష్ఠులు జరగటం తగ్గిపోయింది ... నాకేమీ పెద్ద ఇష్టంకూడా లేదనుకోండి .. మీకు తెలుసుగా. అయినా నాన్నగారి కోసం సాహిత్య వ్యక్తులు వస్తూపోతూ ఉండటం... చర్చలు జరపటం...ఇల్లంతా చాలా కళగా ఉండేది"

చిదంబరం సైన్సు విద్యార్థి పక్కా నిత్యజీవితపు మనిషిని, తండ్రిపట్ల అంతటి ప్రేమాభిమానాలూ గౌరవమూ ఉన్నా, సాహిత్యం పట్ల అభిరుచి కాదుగదా—కనీసం ఆసక్తి గూడా ఏర్పడక పోవటం, చిత్రమే!

సాంబయ్యగారి ఇల్లు—ఏమీ మారలేదు. కాని — ఆ మౌనం లోనూ విలక్షణమైన ఆ గంభీర్యం లోనూ — మృత్యువు పెట్టి పోయిన అడుగు జాడల కొస ఛాయలు ... ఇంకా తెలుస్తూనే ఉన్నాయి

సాంబయ్యగారి సతీమణి — సరస్వతమ్మ. నన్ను చూసి నిజంగానే సంతోషించింది. సగం అభ్యంతరంతోనే అయినా నేను లక్కడికి రావటం, మరీ శిరసా ఓటేమీ కాదనిపించింది!

"ఏంతటి ప్రబతుకైనా — అంతే వాయనా...ఆయన పుణ్యాత్ముడు ... మహరాజులా బ్రతికి, అలాగే వెళ్ళిపోయాడు ... కాని..." సహజమైన వేదనతో ఆమె గొంతు రుద్ధమైంది లేదు సాంబయ్యగారి మీద ఆవిడ చెయ్యగలిగే ఫిర్యాదు ఏదీ లేదు ప్రకృతి సిద్ధమైన సహజమైన ఒంటరితనం — ఆ దుఃఖం

అనుక్షణం సాంబయ్యగారినే గుర్తు చేస్తున్న ఆ ఇంట్లో ఆయన కుటుంబీకు లిచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించాను రాత్రి సాంబయ్యగారి గదే నాకు విడిదయింది మూడు బీరువాల నిండుకూ ఉన్న పుస్తకాలను నాకు కాలక్షేప సాధనాలుగా చూపించి నిష్క్రమించాడు చిదంబరం.

వెంటనే పడుకోవాలనిపించి, పడుకున్నాను కాని ఒక పట్టాన నిద్ర పట్టలేదు కిటికీ గుండా వెన్నెలొస్తోంది. గోడనున్న సాంబయ్యగారి ఫోటో నన్ను పలకరిస్తోంది ఆయన ముఖంలో సన్నటి నవ్వు ఉంది మృత్యువు నవ్వుల్ని చెరిపెయ్యలేదా? ఏది శత్రుత్వం? ఏది మిత్రత్వం? నాకెప్పుడు మాత్రం ఏ శత్రుత్వం ఉంది ఆయన మీద? చనిపోయిన వాళ్ళ శత్రువులైనా క్షమిస్తారు! సకారణంగానే అయినా, ఆయన నా మీద వైమనస్యం కనబరిచినా—దాన్ని నేను లక్ష్యపెట్టలేదు కదా? మరి — స్మారక సంచికకు ఎందుకని రచన చెయ్యలేక పోతున్నాను? ఏమిటి నన్ను అడ్డుకుంటున్నది?

మళ్ళీ లేచాను. లైటువేసి బీరువాల్లో పుస్తకాలు చూడటం మొదలు పెట్టాను. సాంబయ్యగారి రచనలు పుస్తక రూపంగా వెలువడినవన్నీ గనక దొరికితే నా పని సులువు కావచ్చు ఆయన ఎన్నో పుస్తకాలు ప్రచురించారు నవలలు, కథానికా సంకలనాలు, నాటకాలు, విమర్శనా గ్రంథాలు. వగైరా,పోనీ—అన్నీ కాకున్నా—చాలవరకైనా ఆయన బీరువాల్లో తప్పక దొరుకుతాయని నా ఆశ అతుత్రితగా బీరువాలు వెలికిన నాకు నిరాశే ఎదురయింది వరుసలుగా ఉన్న అనేక గ్రంథాల్లో సాంబయ్యగారి రచనలు—నాలుగు పుస్తకాలు మాత్రమే దొరికాయి నాకు అవీ నేను విన్నడో చదివినవే!

నాకు తెలిసి సాంబయ్యగారు స్వవిషయానికి సంబంధించి జాగ్రత్త మనిషే! తన రచనలు తాను ఒకచోట చేర్చి చూసుకుని సంతోషించకుండా ఉంటారా?

స్మారక సంచికకు చెయ్యాల్సిన రచన నన్ను ఆరడి చేస్తోంది

రేని ఓపిక తెచ్చుకుని మూడో బీరువా కూడా వెరిచి గాలించాను ఆఖరికి—నా శ్రమ ఫలించింది అన్వేషణ ఫలించిన తృప్తితో నా కళ్ళు మెరిశాయి

బీరువా దిగువన నిలువుగా పేర్చిన పుస్తకాల వెనక, పసుపు కాగితం చుట్టిన బండిల్ ఒకటి కనబడింది అందులోనివి పుస్తకాలని తెలుస్తూనే ఉంది తప్పని సరిగా అవి సాంబయ్యగారివే! రచయితకు వుండగల సహజమైన ఆత్మ ప్రాముఖ్యతతో— చాలా జాగ్రత్తగానే దాచుకున్నారు సాంబయ్యగారు!

గోడన ఉన్న సాంబయ్యగారు నవ్వినట్లయింది

తీరికగా కూచుని తొందరగా బండిల్ విప్పి నిర్ఘాంతపోయాను. మెరుపు కొట్టినట్లయింది. ఆ పుస్తకాల రచయిత—ఎవరో కాదు— నేను! అవి—నేను రాసిన పుస్తకాలే!

నాలో ఒక గొప్ప మౌనం. ఒక జలదరింపు!

అంతటితో ఆగలేదు పుస్తకాలు అక్కడక్కడా తిరగేసి చూసేసరికి నా కళ్ళమ్మట ధారగా నీళ్ళు తిరిగాయి

ఆ మసకలోంచి మెరుస్తూ కనిపించాయి— ఇంకా కనిపిస్తున్నాయి—ఇప్పటికీ—

పేజీల పొడవునా అక్కడక్కడా చెయ్యబడిన ఎర్రపెన్సిల్ అండర్‌లైన్లు. స్పష్టంగా మెరుస్తూ—ఎర్రగీతలు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

# కన్నతల్లి



ఎస్ హేమలత

అందంగా, మరెంతో సుందరంగా, రంగు రంగుల కాంతులను దీపాలతో, ముచ్చట గొల్పే బెలూన్లతో, మనోహర మైన రంగు కాయితాలతో అలంకరింప బడిన ఉయ్యాలలో ముద్దుగ పవ్వళించింది బాలసార పాపాయి— అదే ఆనందరావు, సునీతల కడుపు పంట మెత్తగ పవ్వళించి, అలవోకగ నవ్వుకుంటూంది. ఆ నవ్వుకు పరవశిస్తూంది సునీత తన ముద్దుల సురి పాపని చూచి. ఆనందరావు పితృ గర్వంతో తిరిగేస్తున్నారు ఇల్లంతా. ఆహూతులు రావడం మొదలెట్టగానే మరింత బిజీ అయి పోయాడు.

"హల్లో, హౌ డు యు డూ, గ్లాడ్ టు సీ యూ, హాయ్, కమిన్, ఇలా రండి. థ్యాంక్స్" అన్న కేకలతో ఆ ప్రదేశం మార్మోగి పోతూంది.

"సునీ! హౌ స్వీట్!" అంటూ, ఊయల లోకి వొంగి చూచింది ఊర్మిళ.

ఊయల కుదుపుకి వులిక్కిపడి కను తెరిచిందా పాప!

"ఊర్మిళా! పాప నా పోలికే కదూ!" ఆసక్తిగా అడిగింది సునీత.

"వేర్ ఈజ్ ది డాట్? షి ఈజ్ జస్ట్ లైక్ యూ" అంటూ చేతులూపుకుంటూ వచ్చిందో నెలవంక. ఆవిడ స్టేట్స్ నుంచి వచ్చి ఇంకా నెల కూడ దాటలేదు. తెలుగు దాదాపు మరిచినట్టే లెక్క.

తృప్తిగ పాపాయివంక మరోక్కసారు ప్రేమగ చూచింది సునీత.

"అబ్బ! చిన్నాళ్ల కెన్నాళ్లకి నీ కోర్కె తీరింది సునీతా! ఆశలన్నీ వదులుకున్నావు కదే!" ప్రాణ స్నేహితురాలు విమల మాటలు కంటకప్రాయంగ తోచాయి సునీతకి. అయినా ఏం మనుష్యులు! ఔచిత్యం తెలీకుండ మాట్లాడుతారు! ముఖం చిట్లించింది సునీత.

"అదేంటమ్మా సునీతా! బాలెంతరాలివి. కాళ్లకి చెప్పులు, చెవులో దూది లేకుండ అలా తిరిగేయడమే...?" మాణిక్యాంబ మందస్వరాన మందలించింది సునీతని.

"ఆ... ఈ కాలంలో కూడ ఇటువంటి ఛాదస్తాలేంటండీ! అదే— స్టేట్స్‌లో అయితేనా..." నెలవంకగారి స్టేట్స్ కబుర్లతో చెవులు తుప్పడిపోయిన శ్రోతలు నిస్సహాయంగ రక్షణ కోసరమా అన్నట్లు సునీత కేసి చూసారు. "ప్లీజ్... ఇటు రండి" అంటూ నెలవంకని టేబిల్ వైపు నడిపించింది సునీత. రిఫ్రెష్‌మెంట్స్‌తో నిండిన టేబిల్‌ని చేరిన నెలవంక యింత బిజీ అయి పోయింది.

పాపనే తదేకంగ చూస్తూ నిలుచున్న వినత తను తెచ్చిన ప్రెజెంట్‌ని ఊయెలలో పెట్టి ఇటు తిరిగి నెమ్మదిగ నిశ్వసించింది. ప్రక్కనే నిల్చున్న సునీత భుజంమీద చేయి వేసి "కంగ్రాట్యులేషన్స్ సునీతా, యూ ఆర్ రియల్లీ వెరీ లక్కీ" అంది.

"థాంక్యూ" అంటూ గర్వంగా నవ్వింది సునీత.

"సునీతా! నువ్వేమీ అనుకోకుంటే నాదొక చిన్న రిక్వెస్ట్" అంది వినత.

"గో అహెడ్" అన్నట్లు చూచింది సునీత.

"నీకు డెలివరీ చేసిన డాక్టరు పేరు చెప్తావా? నేను కూడ వెళ్లి, కన్సల్ట్ చేస్తాను" అంది, వినత.

ఒక్క క్షణం కలవరపడ్డది సునీత. కాని వెంటనే తేరుకొని "ఓ! యస్! దానికేం అలాగే చెప్తాను" అంటూ, ఎవర్నో రిసీవ్

చూసుకోవడానికి గబగబ ముందుకు నడిచింది సునీత.

"వింతైన సునీత అదృష్టవంతురాలు. పిల్లని కన్న ఆయాసం ఇంతయినా లేదు కదా! సులువుగ, వింత హాయిగ తిరిగేస్తోంది మా కాలంలో అయితేనా మేము మూడు నెలలు బాలింతరాలి మంచం దిగే వాళ్ళమే కాదు." మాణిక్యాంబ ఇంటింటి ముచ్చట్లు మళ్ళీ మొదలు.

వీళ్ళ మాటలన్నిటినీ అడ్డగిస్తూ పెద్దగా ఏడ్పు లంకించుకుంది ఉయ్యాలలోని అందాల బాల. పాప రోదనకి ఒక్క ఉదుటున పరుగెత్తుకొచ్చింది సునీత. గబ గబ చేతుల్లోకి ఎత్తుకోబోయింది. కాని అప్పటికే ఊయలని చేరిన సునీత పనిమనిషి లక్ష్మి పాపాయిని సందిట్లోకి తీసుకుంది. లక్ష్మికేసి ఒక్క క్షణం చూచింది సునీత. ఏమనుకుందో పాపాయిని ఆమెకే ఇచ్చింది.

"బేబి జాగ్రత్త!" అంటూ, నాప్‌కిన్ని అందించింది.

లోపలికి నడిచింది లక్ష్మి, పాపాయిని పదిలంగ పట్టుకొని.

"అదేంటి సునీ! మీ లక్ష్మి అంత నీరసంగా వుంది. ఒంట్లో బాగోలేదా?" అంది వినత, వెళ్తున్న లక్ష్మినే చూస్తూ.

"అ... అ... ఈ మధ్య ఏదో సుస్తీ చేసింది. మాతోబాటు బొంబాయికి వచ్చిందిగా! అక్కడి నీళ్ళు పడలేదు" అంది సునీత.

"ఆహా! అలాగా!" అంది వినత.

"సునీతా!" అంటూ హడావిడిగ వచ్చారు ఆనందరావు.

"ఏంటండీ?" అంటూ, ఎదురేగింది సునీత.

"చూడు! డా. సంజయ్ చోప్రా వచ్చారు. బేబి ఏది?" అంటూ ఊయలలోకి వంగాడు.

"ఆకలికి ఏడుస్తుంటే ఇప్పుడే లక్ష్మి పాలు పట్టడానికి తీసికెళ్ళింది." భర్త వెనకాలే నడిచింది సునీత డాక్టరుగార్ని రిసీవ్ చేసుకోవడానికి.

"ఇదేం మాయదారి కాలంరా నాయనా! నెలయినా నిండని పసిగందుకి పాలు పట్టాల్సింది కూలి మనిషా! కన్నతల్లికా మాత్రం తీరుబడి లేదూ! పోన్లే అందం, సోయగం తరిగిపోవూ..." సన్న సన్నగ గొణుక్కుంటూంది మాణిక్యాంబ.

"అందం చెడిపోతుందనే కాదు లే; ఈవిడగారి సోషియల్ ఆక్టివిటీస్‌కి, తిరుగుళ్ళకి ప్రతిబంధకం అని కూడ పాలివ్వడం మానేసి వుంటుంది. ఏం మనిషిరా బాబూ!" మనస్సులోనే తిట్టుకుంది ఊర్మిళ.

"అదే నేనయితేనా...! ఇన్నాళ్ళకు పుట్టిన అనుంగు శిశువును అహర్నిశలూ విడకానించుకోనా...!" తన్మయంగా కళ్ళు మూసుకొని, అప్పుడే నిరాశగా కళ్ళు తెరిచింది వినత.

పదిలంగ, మరెంతో జాగ్రత్తగ, పాపాయిని తెచ్చి ఉయ్యాలలో పడుకోబెట్టింది లక్ష్మి. కడుపునిండ పాలు త్రాగిన పాపాయి హాయిగా నిద్రపోతూంది. అలాగే ఆసక్తిగా అందర్నీ చూస్తూ నిల్చుండిపోయింది లక్ష్మి.

"ఊ... నీకేంపని ఇక్కడ? లోపలికెళ్ళి ఏర్పాట్లన్నీ చూడు. ప్లేట్లన్నీ కడిగి రెడీ చేయమని శామ్యూల్‌కి చెప్పు" అంది, సునీత కటువుగ.

వెంటనే వెనుదిరిగిన లక్ష్మి, అప్పుడే గదిలోకి ప్రవేశిస్తున్న డాక్టర్ సంజయ్‌ని చూచి, ఒక్క క్షణం— ఒకే ఒక్క క్షణం— ఆగి మళ్ళీ, వెంటనే ప్రక్కకి తప్పుకొని లోపలికి వెళ్ళిపోయింది.

"హవ్ ఇజ్ మై స్వీట్?" అంటూ పాపాయి బుగ్గలు ఒక్కసారి నిమిరి, ఆనందరావు వెంట డైనింగ్ టేబిల్ దగ్గరకు నడిచాడు డాక్టర్ సంజయ్ చోప్రా.

ఆహారాలన్ని ఎక్కువ అయిటమ్స్ వున్నాయూ అన్నంత భ్రమ కల్గిస్తోంది డైనింగ్ టేబిల్. ఎవరికి నచ్చింది వాళ్ళు ప్లేట్లలో పెట్టుకొని తను ఫ్రెండ్స్‌తో కుర్చీలలో సర్దుకుంటున్నారు.

"పాప పుట్టినందుకే ఇంత ఆర్భాటం చేసారే...! ఇక పాప పెళ్ళి కెంత అట్టహాసం చేస్తారో...?" ఊర్మిళ మాటలకు ఫక్కున నవ్వారు వినత, వినోదిని, కౌసల్య.

"ఔను మరి! ఇక పిల్లలు పుట్టరు అనుకున్న తరుణంలో ఆపద్బాంధవుడులాగ వచ్చాడట కదా, ఈ డాక్టర్. సంజయ్ చోప్రా యు. కె. నుండి."

"ఔనౌను! సునీత ఫాలోపియన్ ట్యూబులు రెండూ మూసుకు పోయాయి. ఇక పిల్లలు పుట్టే అవకాశమే లేదన్నారట డాక్టర్లు. కాని ఈ డాక్టరు అదేదో సరి క్రొత్త ప్రయోగం చేసారట కదా..." దాదాపు ఏడాది బొంబాయిలోనే వుండి పోయారుగా!" సునీత. వినోదిని మాటల్ని అత్యంత శ్రద్ధగ వినడం మొదలెట్టింది వినత.

"ఔను. నేనూ విన్నానుగాని! సునీత గర్భంలో నుండి అండాన్ని వెలువేసి, సునీత భర్త వీర్యంలోని పురుష కణాలతో కల్పి సైంటిఫిక్‌గ ఒక టెస్ట్‌ట్యూబులో గర్భధారణ గావించారట. అంటే తల్లి గర్భంలో కాక టెస్ట్‌ట్యూబులోనే ప్రాణం పోసుకుంటుందీ శిశువు. తర్వాత మళ్ళీ గర్భాశయంలోకి చేర్చిస్తే తొమ్మిది నెలలకి పరిపూర్ణ శిశువుగ మారి బాహ్య ప్రపంచంలో



# కన్నతల్లి

వస్తుందట. అలా వచ్చిన పాపాయే ఈ పాపాయి." ఊర్మిళ మాటలకు తెరచిన నోరును మూయడం మరచింది మాణిక్యాంబ.

"ఏమిటేమిటి? తల్లి గర్భంలో కాక బయట శిశువు ఏర్పడుతుందా? ఇదేం విడ్డూరమమ్మా..." బుగ్గలు నొక్కుకుంటున్న మాణిక్యాంబని చూచి నవ్వారు వినత, వినోదిని తదితరులు.

"అవునండీ మామ్మగారూ! సునీతగారి పాపాయిని టెస్ట్‌ట్యూబు బేబీ అని కూడ అంటారట! నేను కూడ అలాగే పాపని కనాలని వున్నాను." వినత మాటలకి మరింత విస్తుపోయి అవాక్కయి కూచుండిపోయింది మాణిక్యాంబ.

భుక్తాయాసం తీరని అతిథులు నెమ్మదిగా ఇల్లు చేరే ప్రయత్నంలో పడడం గమనించి ఆనందరావు, "ఒక్క క్షణం అందరు కాస్సేపు ఆగండి. మా చిరకాల వాంఛితాన్ని నెరవేర్చి, మా కొక నూతన జీవితాన్ని, బ్రతుకులో ఒక ప్రయోజనాన్ని మాకు ప్రసాదించిన డా. సంజయ్ చోప్రా గార్కి మేము ప్రేమతో, కాదు, కాదు కృతజ్ఞతతో ఈ చిన్న కానుకను సమర్పించుకుంటున్నాము" అని మడిచి పెట్టిన ఒక చిన్న కాగితాన్ని డాక్టర్ చేతిలో పెట్టి షేక్‌హ్యాండ్ ఇచ్చాడు. సునీత వినమ్రతతో డాక్టరుగార్కి నమస్కరించింది. డాక్టర్ కాయితాన్ని తెరచి చూచాడు. పదివేల రూపాయలకి డ్రాఫ్టు అది. ఆనందరావు కేసి చూచి, "మిస్టర్ ఆనందరావ్! నేను మీ కేసును చేపట్టింది కేవలం ఇంట్రెస్ట్ కొద్దీ: మీరు నాకిచ్చిన మొత్తం చాలా పెద్దది." అన్నాడు, డాక్టర్ చోప్రా.

"అలా అనకండి డాక్టర్! ఏదో మా తృప్తి కోసం మీరు స్వీకరించాలి." దాదాపు ప్రాధేయపడుతున్న దంపతులకేసి ఒక్కమారు చూచి "ఆల్ రైట్" అంటూ, ఆ చెక్కును అందుకున్నాడు డా. సంజయ్ చోప్రా. చెక్కుని వెనక్కి తిప్పి గబగబ ఏదో రాశాడు.

అదే గదిలో దూరంగా ఓటమి చూస్తూ నిరాసక్తంగా నిలుచున్న లక్ష్మికేసి నడిచాడు డాక్టర్ సంజయ్. డాక్టర్ తన దగ్గరికి రావడం చూచి ఒక్కడుగు వెనక్కి వేసింది



ఇటీవల హైదరాబాదులో కొత్తగా ప్రారంభించిన భారతీయ ఆధ్యాత్మిక సమైక్యతా సంస్థ ఛైర్మన్‌గా ఏకగ్రీవంగా ఎన్నికైన శ్రీ టి. సుబ్బరామిరెడ్డి.

లక్ష్మి, లక్ష్మి చేతిని అందుకొని అందులో ఆ డ్రాఫ్టుని వుంచి ఇటు తిరిగాడు డాక్టర్ సంజయ్.

"డాక్టర్...!" అన్నాడు ఆనందరావు.

"యస్! మిస్టర్ ఆనందరావు...! ఈ పైకం ఆమెకే అందుతుంది. షి డిజర్వ్స్ దట్ అమౌంట్" అంటూ గబగబ బయటికి నడిచాడు డా. సంజయ్.

చేష్టలుడిగి నిల్చున్నారు ఆనందరావు దంపతులు.

జరుగుతున్న దేంటో అర్థంకాని అతిథులు అయోమయావస్థలో పడిపోయారు. కాని పదివేల రూపాయలతో నిలబడిపోయిన లక్ష్మి హృదయం బాధతో అలమటించింది.

తన పేదతనాన్ని, అశక్తతను ఆలంబనగ చేసికొని ఆనందరావు దంపతులు శిశువు కొరకు తన రక్తమాంసాలని వినియోగించుకున్నారు. ఇంతెందుకు? ఆనందరావు దంపతుల టెస్ట్‌ట్యూబ్ బేబీని తను గర్భంలో నవమాసాలు మోసి కనింది. కాని తనకేం హక్కున్నదా గర్భస్థ శిశువు పై...? ఆనందరావు దంపతుల నోముల పంట ఆ పాప! చెక్కు చెదరని శరీర సౌందర్యంతో తల్లి కాగలిగింది సునీత! కాని తనో! తల్లయ్యుండి కూడ తను కన్న బిడ్డకు కనీసం కన్నతల్లి అని కూడ చెప్పుకోజాలని అశక్తురాలు!!!

























ప్రతి టార్చి ప్రత్యేకమైన అవసరాన్నిఎట్టి
బడ్జెట్ ననుసరించి డిజైను చేయబడినది
స్త్రీల హేండ్ బ్యాగ్‌లలో చక్కగా
సరిపోయే వివిధ రంగుల చిన్న టార్చిలు
ముచ్చటైన టార్చిలు పెన్‌క్లిప్పుతో
జాకెట్ పాకెట్‌లో సులువుగా తీసుకు
వెళ్ళేందుకు ఇత్తడి టార్చిలు జీవితకాలానికి నమ్మకంగా
పనిచేస్తాయి. తేలికైన అల్యూమినియం టార్చిలు
చూడటానికి అనువైనవి మరియు ఖలువైనవి ఇంకా ఎన్నో!
ఎవరెడి శ్రేణి నుండి ప్రతి ఒక్కరికి కావల్సినది ఉంది
మీకు కూడాను

**ఎవరెడి**

మీ భద్రతకోసం ఈ రాత్రి మీకు ఎవరెడి టార్చి అవసరమవుతుంది.
అది ఉండటం మీకు చీకట్లో మరో రెండు కళ్లు ఉన్నట్లుగా ఉంటుంది.

OBM 6070B/8TEL

# షెల్కోని డైరి

## కోతిపై భాష్పవాయువు!

జమ్ములో వో కొట్లాటను అణచడానికి పోలీసులు చేసిన ప్రయత్నంలో వో దెబ్బ దారితప్పి వో కోతికి తగిలిందట. దాంతో ఆ కోతి ఎగిరి గంతేసి ఆ పోలీసు మీద రాళ్ళు రువ్వసాగిందట. ఆ కోతి ధాటికి తట్టుకోలేని పోలీసులా కోతి మీద బాష్పవాయువు ప్రయోగించారట. దాంతో ఆ కోతి స్పృహతప్పి పడిపోతే దానికి ప్రథమ చికిత్స చేసిన తరువాత చెట్టుపై కూర్చుని అదేపనిగా లేచి చెంపలు గెంతుకుంటూ పోతుందా అని చూస్తున్నారట—జై ఎక వానరమాన్!

## మార్పులోని అసలు రహస్యం!

హైదరాబాద్‌లో వో బ్యాంకులో పని చేస్తున్న గుమాస్తా ఉన్నట్టుండి జాబ్బు మారటం చూసి అతని ఎక్కౌంటాతడు పోలీసులతో చెప్పి అతని జీవిత తీరు మారడం ఎవ్వరూ అనుమానింపదగినదన్నాడట. పోలీసులు విచారిస్తే బ్యాంకు ఎక్కౌంటెంటు సూపర్వైజరు కొంత కాలం, వో ఖాతాదారుని దొంగ సంతకం కలిపి పెట్టి ఆ మహనీయుడు తను పని చేస్తున్న బ్యాంకును మోసం చేసి 53,641 రూపాయలు కాజేశాడట! హో! వాట్ నైబర్ హెజ హి గాట్!

## రు 50 నోటుపై పార్లమెంటు!

యాభై రూపాయల నోటు వెనుక ప్రక్కనున్న పార్లమెంటు భవనం మీద జాతీయ పతాకం లేకపోవడాన్ని గమనించామనీ, యీ డిజైను మార్చి, పతాకంతో ఉన్న పార్లమెంటు డిజైను వేయిస్తున్నామనీ ఢిల్లీలో రాష్ట్ర రాజ్యాంగానికి చెందిన ఆర్థిక శాఖమంత్రి మిస్టర్ జుల్ఫీ క్వారుల్లా రాజ్య సభకు ఎరిగించారట! పిటీ!

## ఆడవేషంలో అర్ధరాత్రి మోసం!

తిరుపూరు (తమిళనాడు)లో తెలతెలవారుతుండగా పోలీసులో నాడో వోమెను అరెస్టు చేశారట. ఆమె రాత్రి పూట వీధుల్లో తిరుగుతూ విటులను వాడుకుంటోందని అరెస్టు చేశారట! తీరా పోలీసుస్టేషనుకు తీసుకెళ్ళి చూస్తే ఆమె ఆమె కాదట! అతనట. వో ఒనీను ఫ్యాక్టరీలో పని చేస్తున్నలందమైన కుర్రాడు రాత్రిళ్ళు ఆడవేషం వేసుకొని విటులను ఆకర్షించి అనక భయపెట్టి డబ్బు గుంజకుంటున్నాడట!

## తాగుబోతు భర్తలు — పొరుగువారి కర్తవ్యాలు!

"తాగుబోతు భర్తలు, వారివల్ల వారివారి భార్యలనగచాట్లు, ప్రక్కింటివారి కర్తవ్యాలు" అనే విషయాల మీద క్షుణ్ణంగా చర్చించుకుని కొన్ని నిర్ణయాలు తీసుకోడానికి కర్ణాటక స్త్రీన్యాయవాదులు, తదితరులూ యీ మార్చి 31వ తేదీ ముహూర్తం నిర్ణయించారట. ఏమయ్యా నీ పెళ్ళాన్ని అలా కొట్టావని అడగటమే కష్టమూ, దుర్భరమూను దీనికి పోయి వో నిర్ణయం తీసుకుంటే దానికి తాగుబోతు భర్తలు కట్టుబడి ఉండాలనుందా! ఏమో మరి!

## కుండలో నీళ్ళు — బావిలో శవం!

సేలం జిల్లా తిరువెంగోడుకు చెందిన శల్లిపాళయంలో పెరియస్వగవుండరు ఇంట్లో ఆవులక్షికో రాజాతి అనే హరిజన అమ్మాయి పని చేస్తోందట. ఒకరోజామె కుండలోనీరు తాగేసరికి గవుండరది చూసి నానా తిట్లు తిట్టి, చితక బాది పంపాడట. ఆమె తండ్రి రామన్ వో పలుగురు పెద్దమనుష్యులతో వెళ్ళి ఆ గవుండరుతో తన పిల్లనలా కొట్టడాన్ని గురించి సంజాయిషీ అడిగితే హరిజన పిల్ల కుండలో నీరు తాగితే వూరుకుంటానా చంపి పాతేస్తాను. తెలుసా! అని అరవంలో అరిచాడట. ఆ మర్నాటి ఉదయం రాజాతి శవం గవుండరు నూతిలో తేలుతూ కనిపించిందట.

## డాక్టరేట్ అందుకున్న అంధుడు!

ఢిల్లీ విశ్వవిద్యాలయం మొట్టమొదటిసారిగా డాక్టరేట్ డిగ్రీ వో అంధునికి యిచ్చిందట. బొబ్బిలిలో పుట్టిన గరిమెళ్ల మోహనరావు పుట్టు గుడ్డివాడట. ఆయన బెంగుళూరు డిగ్రీ హైస్కూల్లో మెట్రిక్ ప్యాసయి వెంకటేశ్వరా విశ్వవిద్యాలయంలో సంగీతం పోస్టు గ్రాడ్యుయేట్ పట్టా తీసుకుని అనక రీసర్చ్ చేసి, థిజిస్ సమర్పించి, ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి తన 36వ ఏట డాక్టరేట్ డిగ్రీ తీసుకున్నాడట. హేట్సాఫ్ టు మోహనరావ్!

# అవీ-ఇవీ-అన్నీ



S. Venkatraghavan

ఒకరకంగా అమితాశ్చర్యకరంగా కనపడే ఎంపికే ఇది. ఇంగ్లాండు పర్యటించబోయే భారతీయ క్రికెట్ జట్టుకి వెంకట రాఘవన్ నాయకుడుగ, విశ్వనాధ్ ఉపనాయకుడుగా నియమితులైనారు ఇద్దరూ దక్షిణాత్యులే సునీల్ గవాస్కర్, బేడీలను కూడా క్రికెట్ కంట్రోలు బోర్డు యీ పర్యటనకు ఎన్నుకొంది. వెంకట రాఘవన్ అనుభవజ్ఞుడు, నిగ్రహం నిలకడ గల గొప్ప బౌలర్.

## నెజ్ఞా నాటక కళాపరిషత్తు

నెజ్ఞా నాటక కళా పరిషత్ జూన్ 5నుండి 10వ తేదీవరకు నెల్లూరు టవున్ హాలులో జరుగుతుంది. సినీ హీరో కృష్ణంరాజుగారిని, జాతీయ ఉత్తమనటిగా ఎన్నికైన శారదగారిని సన్మానించ నిర్ణయించారని అధ్యక్షుడు శ్రీ వి. ఎస్. రెడ్డి తెల్పుతున్నారు.

## రంగుల పక్షి

కవితా సంపుటి రచన శ్రీ వై శేరాపులు. 54 పేజీలు, వెల మూడు రూపాయలు. ప్రతులకు పయ్యా గిగస్, డోర్ నెం. 12—462, 6వ క్రాస్ రోడ్డు, సాయి నగర్, (అనంతపూర్)

## నవ్యతరంగాలు

కథాసంకలనం. ఇందులో శ్రీ వాడూరు చంద్ర, శ్రీ వై. సి. రత్నం, మల్లెమాల శివప్రసాద్. మార్తాటి విజయ సారథిల కథలు ఉన్నాయి, 102 పేజీలుగల యీ పుస్తకం వెల మూడు రూపాయలు. ప్రచురణ : చంద్రోదయా పబ్లికేషన్స్, 5—2—165, అనంతవీధి, తిరుపతి.

## మేనరికం

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి రాసిన 12 కథల సంపుటం మేనరికం మా కార్యాలయం చేరింది 221 పుటలు గల యీ పుస్తకానికి ముఖచిత్ర రచన 'బాలి' దేవి పబ్లికేషన్, విజయవాడ—2 వారికి ప్రతులకోసం రాయవచ్చును. వెల రు 10

## శ్రీ రామకృష్ణ లీలా తరంగిణి

రచయిత శ్రీ వెన్నెలగంటి లక్ష్మీనరసింహారావు 100పుటలు గల యీ గ్రంథం వెల అమూల్యము శ్రీ శివ గ్రంథమాల పేరిట లచ్చమ్మపేట నుంచి యీ గ్రంథం వెలువడింది పుస్తకం కావలసినవారు రచయితపేర గుంటూరుజిల్లా అచ్చమ్మపేటకి 25 పైసల తపాలాబిళ్ళలతో రాయవచ్చును

## శ్రీకాకుళంలో సాహిత్య సమావేశం

సిద్ధార్థి ఉగాదినాడు శ్రీకాకుళం యువభారతి సాహిత్య సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో ఉగాది సమ్మేళనం జరిగింది. ముఖ్య అతిథి శ్రీ "సవ్యసాచి" ఎంజర్లై తెలుగు కవిత్వం మీద ప్రసంగించారు. శ్రీ సున్నా అచ్యుతరావు అధ్యక్షత వహించగా, కార్యదర్శి శ్రీ వేమకోటి సీతారామశాస్త్రి స్వాగతం పలికారు శ్రీయుతులు గుంటి పుండరీకాక్షయ్య, ఐ ఎ. నరసింహం, మధురశ్రీ, ఎ. శ్రీకంఠం శరత్, టి. వీరభద్రయ్య, ఎ మల్లిబాబు, ప్రభృతులు తమ కవితలు చదివారు. శ్రీయుతులు అదిబట్ల వెంకటరమణ, మునేపల్లి సత్యనారాయణ ప్రసంగాలు చేశారు.

---

త్వరలో ప్రారంభం!

# కొత్త సీరియల్

# రాగరేఖలు

మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3 Editor : S Radhakrishna.

PUBLISHED SIMULTANEOUSLY FROM VIJAYAWADA & HYDERABAD

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODDHARAKA K. NAGESWARA RAO




నమ్మదగిన వార్తలకి, నిజాయితీకల వ్యాఖ్యలకి **ఆంధ్రపత్రిక**

